దాక్షిణ్యగాని చలిచీమనైన నడఁగఁ ద్రొక్కనేరఁడు. ఆజనవరుండెట్టిపీడలకును జంకఁడుగాని యసత్యమునకు జంకును. ఆమహానుభావుని హస్తపాదాద్యవయవంబులు సత్కార్యములం బ్రవర్తించునుగాని దుష్కార్యంబులఁ జొరనేరవు.

కరమున నిత్యదానము, ముఖంబున సూనృతవాణి, యాదలన్
గురుచరణాభివాదన మకుంఠితవీర్యము దోర్యుగంబునన్
వరహృదయంబునన్ విశదవర్తన మంచితవిద్య వీనులన్
సురుచిరభూషణంబు లివి సూరులకున్ సిరి లేనియప్పుడున్

ఆమహదైశ్వర్యవంతుని రాజ్యము సర్వవస్తుపరిపూర్ణముగా నుండి క్షామడాంబరములు నీతిబాధలును లేక సుఖావహమై యుండెను. "యథా రాజా తథా ప్రజా." యన్నట్లందలి ప్రజలు రాజువలెనే ధర్మాసక్తులై యుండిరి.

అమ్మహారాజేంద్రునిభార్య మనోరమ. ఆయిందువదన సౌందర్యముచేతనే గాక సుగుణగుణములచేఁ గూడఁ గడుఁ బ్రశస్తిఁ గాంచి పెద్దల పాలిటి పెన్నిధియై యాశ్రితులకుఁ గల్పలతయై పరిచారికలకుఁ దల్లియై రాజగృహమునకు [illegible]యై యుండెను. ఆయుత్తమాంగన పాతివ్రత్యమున [illegible] యరుంధతి యని శ్లాఘింపఁబడుచుఁ, గులధర్మముల [illegible] [illegible] సుశీలంబుచే విలసిల్లుచుఁ [illegible] దయారసంబు, [illegible] పేదయల [illegible] [illegible]వతియై సర్వ[illegible] బుల [illegible] వర్ధిల్లుచుండె. [illegible]

నెడల దాసివలె, నాలోచనము చెప్పునెడల మంత్రివలె, రూపమున లక్ష్మివలె నోర్పున భూమివలె, సరసాన్నముం బెట్టు నెడల జననివలె శయనంబున రంభవలె, నుండ వలె నను ప్రమాణ మామె యందే చూడవలయు. ఇట్లా దంపతులు ప్రజలను దలితండ్రులవలె, బ్రోదిసేయుచు శచీ పురందరులమాడ్కి వైభవసంపన్నులై బహుకాలము సంసారసుఖమనుభవించి వంశదీపకు లగుపుత్రులం బడసిరి. కాని చాలకాలము వఱకుఁ బుత్రికాసంతతి లేకుంకుటం జేసి యతఁడు "పరమేశ్వరా, నాకుఁ బుత్రిక నెపు డనుగ్ర హింతువు. నాయింట లక్ష్మివలె బాలిక యెప్పుడు నడయాడు చుండును. నే నెన్నడు నాంది దేవతలను, శోభన దేవతలను, బూజించువాఁడ. ఎన్నడు కన్యాదానము చేసి పదితరముల పితరులను నరకము నుండి తొలఁగించి బ్రహ్మ లోక ప్రాప్తులఁ జేయుదు" నని యిట్లుకోరుచుండ భక్తరక్షకుఁ డగుశంకరుండాకింకరుల మనోరథ మీడేర్ప ననుగ్రహిం చెనో యన భర్తృమనోరమయగుమనోరమాదేవి గర్భవతి యై నవమాసములు నిండినపిదపశుభలగ్నమున జనకుని పుత్రికం గనియెను. అపుడు వారలసంతోషమంత యింత యని చెప్ప వలవిగా కుండెను. మనుష్యలోకమునకుసుఖాం బొనంగు విషయము లిట్టివి యేగదా! ధనప్రాప్తి, యారోగ్య[illegible] ప్రియురా లగుభార్య, వశ్యుఁ డగుపుత్రుడు [illegible] మాగు విద్య, సుఖప్రదము లని చెప్పెదరు [illegible]

క్షేమముగాఁ బురుడుదినములు గడిచినవి. పదునొకండవ వాసరమునఁ జిత్రవర్మ దైవజ్ఞులు పండితులు మున్నగువారిని రావించి బంధుజనమధ్యంబున మహావైభవముతోఁ బుత్రికకు జాతకర్మమునుఁ గావించి యబ్బాలికకు సీమంతిని యని నామకరణము చేసె. పిమ్మట సంతోషవశమున నరవరుండా సభాస్థలిం గలజ్యోతిష్కులంగాంచి "యయ్యలారా! మీరు మహాపండితులు, త్రికాలజ్ఞులు, గావున నాయీబాలికకు జాతకలక్షణంబుల సెలవిం" డని ప్రార్థించె. అపుడు సభా సదులలో సర్వగణ్యుఁడు వృద్ధుఁడు నగుభూసురోత్తముఁడు నృపతి పలుకుల కలరి నిలువం బడి యిట్లు వక్కాణించె. "రాజోత్తమా! నేను జననకాలలక్షణమును బట్టి యీబిడ్డ దశాయోగములను దెలిపెదను. ఈబాలికామణి పార్వతివలె సర్వమంగళనామకయు, సరస్వతివలె సర్వవిద్యాపరిపూర్ణయు, మహాలక్ష్మివలె నిఖిలశుభలక్షణసంపన్నయు, సంపూర్ణచంద్రిక వలె దశదిశలం బర్విన నిర్మల కీర్తిశోభితయు నై పది వేలవర్షములు ప్రాణేశ్వరునితో సర్వసుఖంబు లనుభవించుచు సిరిసంపతులతోఁ దులదూగుచు మహోన్నతపదవి నొందఁ గలదు." ఇట్లు పలికిన పుడమివేల్పుపలుకులకు రాజేంద్రుఁడు సంతసిల్లి యాతనికి సువర్ణవస్త్రాదుల బహూకరించెను. ఇంతలో మఱియొక దైవజ్ఞుఁడు లేచి సధైర్యముగా "రాజోత్తమా! వినుము రాజసభకు బోవుటయేయనుచితము. ఒకవేళ వెళ్ళినచో యందున్నపతి యడిగినదానికి మొగమోట

పడక యథార్థమునే వచియించుట పండితలక్షణము కావున నున్న దాని దాపక వాక్రుచ్చెద. చల్ల కై వచ్చి ముంత దాప నేల? ఈసీపుత్రికకుఁ బదునాలవవత్సరమున వైధవ్యము సంభవింప గలదు." అని నుడివిన గర్ణశూలంబు లగునామాటలు విని చిత్రవర్మ పిడుగడచినవానివగిది, భూతము సోకినవానిపోలిక నిశ్చేష్టితుండై కొంతసేపటి కించుక తెలిసి సముద్రతరంగములవలె పైకొని వచ్చుశోకపరంపరల నాపఁజాలక కుందుచు, జ్ఞానవంతుఁడుగావునఁ గొంతవడికి జెల్లెలికట్టయుం బోలెబుద్ధిబలంబున దుఃఖజలంబును మరల్చి మనంబున నిట్లు విచారింపఁ దొడంగెను "అక్కటా యెంతమాట వింటిని! పరమేశ్వరుడు నాబుత్రిక ననుగ్రహించెనని యెంతో యుల్లాసమందుచున్న నాకీమాట హృదయశల్య మయినది. దీనిఁదొలఁగించుట కుపాయ మేమి కలదు? ఈశ్వరేచ్ఛను మరల్పువా రెవ రుందురు? ఇచ్చినవిధాత మఱలఁ గొంపోవుచుండ నడ్డుపెట్టువా రెందైన గలరే! నాకీ వెఱ్ఱి విచార మేల. కానున్నది కాక మానదు. రానున్నది రాక మానదు. విచార మొంది చేయున దేమి? దేహికి సుఖ దుఃఖము లీశ్వరేచ్ఛాధీనములు. ధైర్యమే విచార మడచుటకు దివ్యౌషధము. కావున దానినే యవలంబింపలయును మఱియు నిందొకటి విచారింపవలసియున్నది. ఏమి యన నీపండితు లిరువురును జ్యోతిశ్శాస్త్ర రహస్యముల నెఱింగినవా రే. వీరు నా యెదుట నెన్నఁడును ముఖప్రీతివచనములఁ బలుకువారలు

కాదు. ఇట్టివిదు ద్వివిధముగా బలుకుటకుఁగతి మెయ్యది. వీరాదు వేర్వేరుగా నిక్కలచెప్పితిరని వీరి నడుగునమా తగుశాస్త్ర సమాధానములతో వారివారిపక్షము లనుకూలముగా సమర్థించు కొందురు. కావున వారి నడుగుట యుక్తముగాదు. ఇంతకు మున్నొక శ్రోతను ప్రవర్తించుచున్న నాచిత్తము వీరిమాటలచేఁ గొండను దగిలిన ప్రవాహమువలె నిరుదెఱఁగులఁ బాఱుచున్నది. ఇం దొక్కరుఁడు కేవలసంతోషమును మఱియొక్కఁడు దుఃఖము నుపపాదించె. తేజస్తిమిరములు వోలె నుభయపక్షములు నేకముగా నొక్కచోట నుండుట యసంభవము. సత్య మొక్కటిగా నుండును, గాని ద్వివిధ ముగా నుండదు గదా. ఇందు దేనిని వాస్తవముగా నిర్ణయించి మనస్సును దృఢపఱచికొందును? నేమి యనితాగు దునా? నూనెయని తలకుబోసికొందునా ఎట్లునిశ్చయించెద!" యని పలువిధంబుల వితర్కించియేమియుఁ దోఁపక సర్వభారమును దైవముపై నుంచి ధైర్యముతో నుండెను.

సంపదలు గల్గుతఱి మహాజనులహృదయ
మభినవోత్పలకోమలం బగుచు వెలయు;
ఆపదలు వొందునపుడు మహామహీధ
రాశ్మసంఘాతకర్కశం బై తనరు.

ఇది యిట్లుండ నాసీమంతిని శుక్లపక్షచంద్రకళవలె క్రమ క్రమముగా నభివృద్ధి నొందుచు నడువ నేర్చి బాల్యక్రీడలచే మాతాపితలకును, జూచువారలకును, సంతసంబును గ్రుమ్మరించు చుండెను. ఒక్కయెడc దనయీడు బాలికలతో నాడు కొనుచు బొమ్మలపెండ్లిండ్లు గావించుచుండును. ఒక్కొక్క తఱి దాcగుడుమూతలాడుకొనుచు నేనే గెలిచితి నని సఖులతోc దనయతిశయమును దెల్పుచుండును. ఒక్కొక కాలమునc జెలికత్తెలకు విందులు గావించుచు దనదాన గుణమును బ్రకటించును.

మఱియొకసమయమునc జెలికత్తెలతో నుద్యానవనమున నంచరించుచు వాలిపడియున్న సుమదీcగెలం జూచి తన మొయిసీగెం బోలcజాలక సిగ్గుచే వ్రాలిపోయె నని పరిహా సించెనో యనునట్లు చిఱునగవు నగుచుండును. ఒకపుc రాయంచలవలె నడcపc బ్రయత్నించును, చిలుకలవలెc బలుకుచుండును. అంతc బిత్రాజ్ఞచే నామె గురువులకడc జదువ నారంభించెను. సూర్యదర్శన మాత్రముననే కమలము వికసించిన పగిది నొకసారి విన్నంతనే యా యావిష యముల నెఱింగి బుద్ధి ప్రకాశింపc దొడcగె. తనయీడు బాలికలతోc జదువుచుండును. చిఱుతప్రాయముననే వీణా

వాయింప నేర్చికొని కంఠస్వరంబుచే నాతంత్రీరవమ్మునుఁ గూడఁ దిరస్కరించుచుండెను.

ఇట్లామె శైశవంబు గడుపుచు నెల్లరకు నల్లారుముద్దు గావించు చుండెను. తల్లి యొడిలోఁ గూర్చుండి తనకు గొప్ప గొప్ప విషయములు తెలిసినట్లు నడుపుచు నల్లము నల్లిసింపఁ జేయు చుండెను. ఆసీమంతిని. బాల్యచేష్టలకు నానందించుచుఁ బౌరులెల్ల నామెకథలను జెప్పుకొను చుందురు. అంత గృహకృత్యములయందుఁగూడ నిపుణముగా మెలంగుచు గురుజనముల యెడ వినయవిధేయతలతోఁ బ్రవర్తింప నేర్చి యౌవనవతి యగుచున్న కుమారికం జూచి జననీజనకులామె వివాహవయస్క యయ్యెనని సంతసించు చుండిరి.

యౌవనాంకురముచేతను, సుందరవిలాసములచేతనుఁ బాలుగారుదంతపంక్తిచేతను, మనోహరాకారముచేతను, శోభాయమానాంగి యగుపుత్రికనుఁ జూచు నప్పు డెంత మోదమునుపొందినను జంద్రికి వెనుకటి దుఃఖము మఱపునకు రాలేదు. అప్పు డప్పుడు సెల వేయుచున్న నాదికురుపువలె నావేదనము గావించుచు వేఁడినిట్టూర్పులు వెలువరించు చుండెను. ధైర్యలవిత్రముచే వ్యధావల్లిని దును మాడిచిత్రవర్మ సీమంతినీపరిణయమునఁ గృతసంకల్పుఁడై యుండెను.

---

లోకప్రసిద్ధ మగు నిషధదేశమునఁ గుండినపురమును రాజధానిగాఁ జేసికొని దమయంతీహృదయేశ్వరుం డగు నల చక్రవర్తి మున్ను రాజ్యమేలిన విషయ మెల్లరకును విశదమే. ఆ సార్వభౌమున కింద్రసేనుఁ డను నందనుఁడు గలఁడు. అతఁడు పితృదత్తం బగు రాజ్యంబును మహోన్నతవైభవమునఁ బాలింపుచుఁ బుష్పంబు వృక్షంబునకు వన్నె దెచ్చు కరణిఁ దండ్రి గౌరవమునకు శోభగలిగించుచు నుండెను. జనకుని యౌన్నత్యమునకుఁ దీసిపోవక జగదేకవీరుండై యుండెను. పులికడుపునఁ జలిచీమ పుట్టునే? నలసార్వభౌముఁడు పలువిధము లగు కష్టము లొంది యశ్వహృదయాదివిద్యలందు దక్షుఁడై దేశపరిభ్రమణము సేయుటచేఁ బవిత్రంబగు నతని కీర్తి భూకాంతకు శుభ్రవస్త్రమై విలసిల్లెను. ఇంద్రసేనుం డట్టికష్టులు పడకుండుటచేతఁ గాఁబోలు నీతని కీర్తి జగంబున నంతగా వ్యాపింపకుండెను. దాన ధర్మపరాక్రమాదులచేఁ బితృసమానుం డనుటకు సందియము లేదు. ఆ యింద్రసేనమహారాజునకు జంద్రాంగదుఁ డను తనూజుఁడు గలఁడు. ఈపుత్రుండు పదునెనిమిదేండ్ల ప్రాయంబు గలిగి తనయీడు రాజపుత్రులలో నక్షత్రములలోఁ జంద్రుండువోలెఁ దేజరిల్లుచు సర్వలోకశ్లాఘాకరుం డై తనరారు

-చుండెను. ఆ రాజకుమారుఁడు విద్యాబుద్ధుల యందాతి తేజి గజాశ్వారోహణకుశలుం డై రాజకీయతంత్రంబుల నెల్ల గ్రహించి వివాహవయస్కుం డై యుండెను. ఆచంద్రాంగదునం దొక గుణవిశేషము గలదు. అతఁడు పరమశైవుఁడు. అతం డాశివుని యెడ భక్తిపారవశ్యమున దేహమును మరచు చుండును. ఇట్టి శుభలక్షణములు గలచంద్రాంగదున కెవఁడు సాటియనఁ దగును?

ఒక్కయెడఁ గొందఱు విద్యాపారంగతు లార్యావర్తమునఁ జిత్రాంగదమహారాజుకడ ధనసత్కారముల నంది యింద్రసేనునిసభాస్థలమున విద్యాప్రకర్షను జూపి బహుమానంబుల నందుటకై యేతెంచిరి. విద్వాంసులకు దారిద్ర్యము పుష్పమునకుఁ బరిమళము వంటిది. ఏలయన, గజములకు మందబుద్ధియు, సర్పముల కతిసిద్రయు, బ్రాహ్మణుల కేకీభావమును లేకుండుటయు లోకోపకారకమైనట్లు పండితులకు పేదఱిక ముండుటయు లోకోపకారక మే. ప్రథమమున దారిద్ర్య మున్నచోఁ దరచుగ దేశసంచారము చేయుట తటస్థించును. దేశసంచారమువలన విద్యావంతుల దర్శనము, నందుచే విద్యాభిలాషియుఁ, దనన్తరమున విద్యాప్రాప్తియు, నట్టివిద్యచే రాజగౌరవము ధనప్రాప్తి, పరమార్థజ్ఞానముగూడఁ గలుగును. విద్యావంతుఁడై రాజసభాస్థలములఁ జరించె నేని వానియశము జగద్వ్యాప్తమగును. విద్యావంతుఁ డయ్యును శిష్యులకు బోధింపక దేశాటనము

చేయక, తగువారితోఁ బ్రసంగింపక కూపస్థమండూకము వోలెఁ దనయింటనే యున్నచో నాకోవిదుని పేరెవ రెఱుంగఁ గలరు? మఱియు దాత లగువా రుత్తమపాత్రము లని విద్యావంతులకే ధనదానాదులు నొసఁగు చుందురు. అందుచే దాతలకు నుత్తమలోక ప్రాప్తియగును. కావున నితరులకు "బుణ్యలోకములను సిద్ధింపఁ జేయుటకుఁ గూడవిద్యావంతుఁడే సాధన మగుచున్నాఁడు. విద్వాంసులు దరిద్రులు గాక ధనవంతులయినచో దేశాటనము సేయరనియు, నందుచే వీరియశము వ్యాప్తముగాదనియు, జనులకుఁ బుణ్య లోకంబులు గలుగ వని యే కాఁబోలు విధాత పండితులను పేదవారినిజేసి యున్నాడు. "విద్వత్సుదారిద్రతా" యని మనము చెప్పుకొనుచున్నాముగదా! మనుజునకు విద్యయుండె నేని నేలోపమును గలుగదు.

పాలనసేయుఁ దల్లివలె, బాగుగ సద్గతి దెల్పఁ దండ్రినిం
బోలును, దుఃఖ మార్చి సతిపోలికగా రమియింపఁ జేయు, ది
గ్జాలమునందుఁ గీర్తి బొసఁగ న్వెదజల్లును, లక్ష్మినీయఁగా
జాలును, విద్యకల్పలతచాయ నొసంగద చెట్టికార్యమున్

విద్యాసముద్రులగువిప్రోత్తములింద్రసేనునికడకు వచ్చి యాతఁచే సత్కారంబు లంది ప్రస్తావనావశమున సీమంతి నీసౌందర్యవిద్యాదుల నగ్గడించుచు నామధురవాణి గుణ గణంబుల సహస్రవిధంబుల వర్ణించి చెప్పి సత్కృతులై యేగిరి. అంత వారిమాటలకింద్రసేనుఁ డబ్బురపడి యామెకొడు

లైఁచో భాగుగనుండు గదా యని భావించెను. చంద్రాంగదుఁ డను వారిమాటలు వినియే యున్నాఁడు అంతనుండియు నదియేమో కాని చంద్రాంగదుఁడు సీమంతిని యందు మోహపరవశుఁ డై యామత్తకాశినిని పెండ్లి యాడ దలఁచి యుండెను. సీమంతినీగుణశ్రవణము చంద్రాంగదుని మనము నాకర్షించినది.

౪

మహారాజభవనములయందు నానాదేశరాజుల యొక్కయు, రాజపుత్రికలయొక్కయు, రాజపుత్రులయొక్కయు, చిత్రపటము లుండుట సహజము. ఒకానొక సాయంకాలమున సీమంతిని చంద్రశాలయందు సఖీజనములతోఁ గూడి మానసోల్లాసముచేమృదుమధురముగా వీణాగానంబు సేయుచుఁ గొంత కాలక్షేప మొనర్చి యనంతరము తన యెదుట నుండు కుడ్యమునం దమర్పఁ బడియున్న వింత వింత లగుచిత్రపటముల నవలోకించుచుఁ దనచెలికత్తె యగుమంజువాణితో "సఖీ నీవు కడునేర్పరివి. నీసరసవచనములతో నాహృదయమును రంజిల్లఁజేయుచుందువు. కావున నే నీమాటలాలించుట యన్న నాకుమిగులనిష్టము. ఏది, నీవాక్చాతుర్యముచే నన్నానందింపఁ యుము. నాకుఁ బ్రొద్దుబోవ కున్నది'' అని యడిగిన నది,

అమ్మా నీవు సీమంతినీతిలక మవుగదా? నీయెదుట నా మంజువాణి తన మేమిచేయఁగలదు? సరేకాని నీవుతెప్పలార్పక న్యేమియో చూచు చున్నావే, దేనిని?" అనెను.

సీమం: ఏమియు లేదు. ఇందుఁ జిత్రింపఁబడిన బొమ్మలను జూచు చున్నాను.

మంజు: ఏల యట్లుచూచెదవు?

సీమం: ఏల యందువా ఏవిలోనీపటమున జిత్రింపఁబడిన యాకారసౌందర్యము నన్నాకర్షించు చున్నది.

మంజు: సఖీ; యీపటము నందలి రాజకుమారుఁ డెవ్వరో నీకుఁ దెలియునా?

సీమం: తెలియదు, గాని దీనిఁ జూచినది మొదలు నాదృష్టిమరల కున్నది. ఏదీ నీకు దెలిసిన చో నీరాకుమారు డెవరో చెప్పుము!

మంజు: నీకు దెలియ లేదా?

సీమం: తెలియలేదు.

మంజు: నిజమేనా?

సీమం: నిజమే.

మంజు: తెలియకున్నఁ జెప్పెద వినుము. అనుగుణ ముక్తాకరుఁడుఁ ఆజగన్మోహనాకారుడు, ఆయనయేనీభర్త!

సీమం: (సిగ్గుపడి) ఏమీ నీపరిహాసవచనములు! అందుచేతనే కదా నీవు మంజువాణి వైతివి!

మంజు: ఇఁక సిగ్గెన్నాళ్లు లే అదియు గొలది రోజులలోనే తొలఁగఁ గలదు.

సీమం: సరే నీయొకతాళిమాటల కేమి గాని చెప్పుము. ఈరాకొమరుని పే రేమి?

మంజు: పేరా, చంద్రాంగదుఁడు. నలచక్రవర్తి గారి మనుమఁడు. ఇంద్రసేనునిపుత్రుఁడు. ఇప్పటి యే రాజపుత్రులు గూడ నీతని సహస్రాంశము నైన బోలరు.

సీమం: సరే సంతోషకర మే గాని యింక నీపటముల యందలి రాజపుత్రు లెవరు?

మంజు: వీరా, ఈతఁడు కుంతలరాజపుత్రుఁడు వీరవర్మ. ఇతఁడు కొంకణమహీపతినందనుఁడు. ఇంక నెందఱో యున్నారు. వీరిసంగతి మన కేల?

సీమం: చెలీ! అదియేమో కాని యీపటమును విడువఁజాల కున్నాను. ఏదీ యిటు తెమ్ము. కన్నులారఁ జూచి దీని ముద్దు గొందును.

మంజువాణితీసియీయఁగా సీమంతిని దానినిముద్దు పెట్టుకొనెను. ఇది యిట్లుండఁగా రాగమంజరి యనునొక చెలికత్తె వచ్చి అమ్మా! సీమంతినీ బొత్తిగా జల్లపడినది. ఉద్యానవనమున కేగువేళ యయినది' యని పలికెను. దాని విని సీమంతిని "మంచిది వచ్చెదను," అని చెప్పి "మంజువాణీ మన భద్రుని రాత్రి మొదటియామమున గుఱ్ఱపుబండి నుద్యానముకడకు, దీసి కొని రమ్మని చెప్పి నీవుబండిలో రమ్ము మేము వెళ్ళెదము" అనిపంపెను.

సీమంతిని రాగమంజరితోఁ గూడఁ గాలినడకను వనో
ద్యానమునఁ గేఁగుచుండెను. అపుడు రాగమంజరి యేమో మా
టచెప్పు చున్నది. సీమంతిని చెవికి నాటలేదు. రథము గాలి
కెదురుగా ముందుకు బోవు చున్నను ధ్వజమునకుఁ గట్టిన
గుడ్డ వెనుక వైపునకే పోవు చున్నట్లు సీమంతినిపాదము
ముందు కేగుచున్నను మనసుమాత్రము చంద్రాంగదుని
పటము పైకే జరుగుచుండెను. సీమంతినిమనస్సు వేరైనది.
ఆమెకు లోకమంతయు జంద్రాంగదమయ మాయినది.
ఇరువురును క్రీడోద్యానమున కేగిరి. రాగమంజరి వసంతమును
మంజరులఁ జూపు చున్నది. సీమంతినికి వాని పై
దృష్టితిరుగలేదు. సీమంతిని మనస్సు వేఱుగా నుండుటఁ
జూచి రాగమంజరి తనలో అయ్యో నా చెలికి గష్టవార్త
దెలిసెఁ గాఁబోలు, కావున నిట్లు పరధ్యానముగా నున్నది.
అయినను నిట్లడిగిచూచెద" నని ప్రకాశముగా, "అమ్మా
సీమంతినీ, విచారమేల? అప్పటికే దేవుఁడైన నడ్డ
పడఁ గూడదా? నీకిష్టము తొలఁగును లే." అను నామాట
విని సీమంతిని యెట్లో మనస్సు మరల్చుకొని "యేమో
రాగమంజరీ! యిట్లను చున్నావేమి. ఇపుడు నా కేమికష్టము
వచ్చినది? నీకు మతిపోయెనా యేమి?" అను నామాటలకు

రాగమంజరి యులికిపడి "ఓహో యేమో మునిఁగినది. వినాయకునిఁ జేయఁ బోవఁ గోఁతి యాయ్యెఁ గదా. నే నీమె యాలోచన నెఱుఁగక వేళ నై యిది బైటఁ బెట్టితిని. ఈమె కిది తెలియదు. ఇఁక నెట్లుదాచెద! ఏమో మోసము రానున్నది. కానిమ్ము. ఇట్లు దెలిపెదఁ గాక" యనుకొని "ఏ...మ్మా...ఏ...మి...లేదు.... ఏమియు లేదు. పొరపడి చెప్పితిని..." అని పలికెను.

సీమం—సఖీ! యేమి యీతబ్బిబ్బులు. నీ కేమియు భయము లేదు. అది యేమియో దాచక చెప్పుము. చెప్ప కుంటివా నన్ను జంపుకొన్నట్లే! అని యొట్టు బెట్టెను.

"ఏమైన నగుఁగాక చెప్పియేతీరవలయు" నని యెంచి రాగమంజరి "అమ్మా నీవు పసిబిడ్డవై యున్నప్పుడు మీ తండ్రిగారు నీజాతకవిషయమై నడుగ నొక జ్యోతిష్కుఁడు నీవు సౌభాగ్యవతి వై మహాభోగము ననుభవింతు వని చెప్పె నఁట. అప్పుడే మఱియొక దైవజ్ఞుఁడు నీకుఁ బదునాల్గవ యేట వైధవ్యముగల్గు నని చెప్పెనఁట. ఇది నీవు తెలిసివిచారముచేఁ బరధ్యానముతో నుంటి వని యిట్లు చెప్పితిని నన్ను క్షమింపుము. నీయాపద తొలఁగును గాక!" యని యున్న కుండెను.

సీమంతిని యీపిడుగుమాట విన్న తోడనే మూర్ఛిల్లి రాగమంజరి చేయు చున్నశైత్యోపచారములచే నించుక తెలివి నొంది "చెలీ, నాకర్మమునకు నీ వేమిచేసెదవు. నాకే

మియుఁ దోచుట లేదు. మాగురువుగా యాజ్ఞవల్క్యుని భార్య మైత్రేయి యున్నది. ఆమె యొద్దకు నన్నుఁ జేర్పుము. ఆమెయే నాకు శరణము. ఆదేవి యేమయినఁ జెప్పి నామనస్తాపము దీర్చునేమో" యని తెలుప నంత రాగమంజరి "అయ్యో! యెంతిపాపాత్మనైతిని. ఎంతపాప మొడిగట్టుకొంటిని. చెలి కెంతకష్టముఁ దెచ్చిపెట్టితిని! ఏలచెప్పితి" నని పరితపించుచు సీమంతినిని మైత్రేయి యొద్దకుఁ జేర్చెను.

ఇక్కడికి ౧సాభాస మయినది. స్వర్గమున నున్నది పాతాళమునఁ బడెను.

౬

సృష్టియందు స్త్రీలలో మహాపతివ్రతలు గలరు. వారిసంకల్ప మమోఘము. తలఁచినచో గట్టికార్యము లైన వారు సాధింపఁగలరు. అట్టి సాధ్వీరత్నముల చరిత్రముల మన మక్కడక్కడ వినుచున్నాము. అట్టివారిలో నీమైత్రేయి గణింపఁ దగి యున్నది. మున్ను సూర్యభగవానునితో విరోధము గొని వేదము నన్యథా సృజించిన శ్రీయాజ్ఞవల్క్య మహామునీంద్రున కీమె భార్య. ఈ మునిపతి యగు గార్గియు నీమెయు భర్త కడ బ్రహ్మవిద్యాప్రసంగము గావించిన

విషయము లుపనిషత్తులయందుఁ దెలుపఁబడి యున్నవి. సీమంతిని సవిచారహృదయ యై మైత్రేయియొద్దకుఁ జేరి సర్వోపద్రవముల నడంచుప్రభావము గలయాసుదతీమతల్లి పాదములకు మ్రొక్కి తనరాఁబోవు దుర్దశ నామె కెఱింగించి “అమ్మా నీవు నన్ననుగ్రహింప వలయు నాకు శరణంబు నీకంటె వేఱు లేదని దీనముగా వేఁడుకొనెను. మైత్రేయిగారు దివ్యచిత్తమున నంతయు నెఱింగి “బిడ్డా! భయపడకుము. పాపము శాంతించును గాక. నీయాపద దొలఁగఁగలదు. దీని కొకసులభమార్గ మున్నది. అది పరమరహస్యము. నీపై వాత్సల్యముచేఁ జెప్పుచున్నాను. దాని నాచరించినచో నీయాపద తొలఁగును. సావధానమతివై వినుము.

తావన్మృత్యుభయం ఘోరం తావదేవ జరాభయం
యావన్నోపైతి శరణం దేహీ శివపదాంబుజమ్
తపసా విద్యయా బుద్ధ్యా మంత్రౌషధరసాయనైః
అతియాతి స్వయం మృత్యుం న కశ్చిదపి పండితః,

“మానవుఁడు పరమేశ్వరుని చరణారవిందముల శరణుఁ జొరకుండునంతవరకే ఘోర మగు మృత్యుభయమును, జరాభయమును బొందుననియు, జ్ఞాని యగువాఁడు తపముచేతను, విద్యాజ్ఞానముచేతను, బుద్ధినిశ్చయముచేతను, మంత్రారాధనముచేతను, రసాయనము లగునౌషధములచేతనుఁ మృత్యుదేవతను గెలుచు ననియుఁ బురాణములు సిద్ధాంతీకరించుచున్నవి. కావున ననన్యభక్తితో నీశ్వరుని సేవించువారికి మృత్యు

భాగ్యముగలుగనేరదు. నేనొనర్చు దేవతారాధనము మున్నగు నవి భర్త నెట్లు దీర్ఘాయుష్మంతుని గావింపఁ గలవని సంశయింపవలదు. పురుషునకు భార్య యనునది శరీరములో సగము పాలు. పత్ని యొనర్చిన తపోవ్రతాదులు పతిమతికాయుర్వృద్ధి నొసఁగును అందువలననే యుత్తమాంగనలు పతి శుభాభివృద్ధిని గోరి పరిశుద్ధ హృదయంబులతో నోములు మొదలగునవాని నలుపుచుండుటయని చెప్పఁబడియెను. ఇతర దేవతల నుద్దేశించి తా నగ్నిహోత్రమున సమర్పించిన యాహుతి యా యా దేవతలకుఁ జెందు నట్లు భర్తనుద్దేశించి తా నొనర్చు సత్కర్మములఫలము భర్తకే చెందుచుండును. స్నానము, వ్రతము, యజ్ఞము, దానము, శమదమాదులు, వివిధములైన యుఁ దపమ్ములే యని వేదములయందుఁ జెప్పఁబడియున్నది. స్త్రీలకు యజ్ఞాదులొనర్చుట తగదు. వ్రతంబులు సలుపఁ దగును. అవివాహితలగు కన్యలకుఁ గొన్ని వ్రతంబులును, వివాహితలకుఁ గొన్ని వ్రతంబులును, ఉభయులకు సలుపఁ దగినవి కొన్ని వ్రతంబులును గలవు. అందు నీవు మృత్యుంజయుఁ డగు పరమేశ్వరునకును సర్వమంగళ యగు గౌరీదేవతకును దృప్తి యగునట్లు వ్రతము సలుపవలయును. అది సోమవాసరమునఁ జేయ నగును. ఉమ యనగాఁ బార్వతి. ఆమెతోఁ గలసియున్న వాఁడు గాన సోముఁడయ్యెను. అట్టి యర్ధనారీశ్వరునకుఁ బ్రీతికర మగుటం జేసి దానికి సోమవార మని పేరు గలిగెను. సోమవారమునఁ బార్వతీపరమేశ్వరుల నుద్దేశించి భక్తియుక్త

ముగ వ్రతమునలిపినచో నిష్టప్రాప్తియు ననిష్టపరిహారము నగును. కావున బిడ్డా పరమ పవిత్రమగు సోమవాసరమున నీవు వుపవాసమొనర్చి వేకువనే నదీజలంబుల స్నాన మాడి పరిశుద్ధములగు పవిత్రాంబరముల ధరియింప వలయు. పిమ్మట నిర్దిష్టమై సమలంకృతమగు పూజా గృహంబుజేరి పురోహితునిచే మంత్రములవలన నాహ్వానింప జేయబడిన పార్వతీపరమేశ్వరులకుం బ్రాణప్రతిష్టను గావించి నిర్మలమైన బుద్ధితో షోడశోపచార ములతో నావరణదేవతల విధ్యుక్తముగం బూజింపుము. అనంతరమున బ్రాహ్మణులకు సరసాన్న దానంబులతో సంతర్పణము గావింపుము. యథాశక్తిగా దంపతీపూజలను జేయుము. ఇట్లు గౌరీశంకరారాధనము చేసితివేని నీయాపద తొలంగును. ఉమామహేశ్వరుల కభిషేకము చేయుటచేం బాపక్షయంబును, పీఠపూజనముచే సామ్రాజ్యాభివృద్ధియు దీర్ఘసుమంగలీత్వమును గలుగును. గంధపుష్పాక్షతల నర్పించుటచే సౌఖ్యము లభించును. ధూపదానము దేహమునకు బరిమళము నిచ్చును. దీపదానమువలన శరీరకాంతి హెచ్చును. నైవేద్య మొసగుటచే మహాభోగము గలుగును. తాంబూల మొసగితి వేసి లక్ష్మి యింట కాపురముండును. భక్తితో నమస్కరించిన యెడల ధర్మార్థ కామ మోక్షము లనుచతుర్విధ ఫలములును సిద్ధించును. మంత్రజప

మొనర్చితి వేని నష్టైశ్వర్య సిద్ధిగలుగును. హోమము చేయుట వలనఁ గోర్కెలు నెఱవేఱును. బ్రాహ్మణులకు దుష్టిగలిగింతు వేని సర్వదేవతలును దృప్తి నొందుదురు. ఇట్లు వ్రత మాచరించినచోఁ బెనుగాలి సోఁకినదూదిపింజలవలె నీయాపద లెగిరి పోవును. పుత్రీ! యెట్టియిక్కట్టులు వచ్చినను విడువక యీవ్రతము నాచరింపుము. నీవు దీర్ఘసుమంగలివి కాఁగలవు. అని దీవించి పంచిన సీమంతినియు నిజగృహంబున కేతెంచి మైత్రేయిమాటను సత్య మనినమ్మి కొని యామె చెప్పిన తెఱంగునఁ బట్టు వదలక నిర్మల చిత్తంబుతో వ్రతము నిర్విఘ్నముగ సల్పుచుండెను.

ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్నవిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

౭

తొల్లిటిజన్మమున నధికపుణ్యములు చేసినయుత్తముల కీజన్మమునఁగర్మానురూపము లగుసంకల్పములు గలుగు చుండును. అట్టిసంకల్పములను భగవంతుఁడు సహాయుఁడై నెఱవేర్చు చుండును. సీమంతిని సోదరసిభక్తితో వ్రతమునాచరిం

చుచుఁ దగువేళల విద్యాపరిశ్రమము మున్నగువాని నొసం
చున్నను జంద్రాంగదునిపైఁ గల ప్రేమను మఱల్చ జాలకయే
యుండెను. చిత్రవర్మయుఁ బుత్రికకుఁ జంద్రాంగదునిబెండ్లి
యూడ వలయు ననుకోర్కె యున్నట్లు తెలియును.
చంద్రాంగదుఁడు మహారాజపుత్రుఁ డనియు, సర్వవిద్యాకుశలుఁ
డనియు, నియమవిశేషసంపన్నుఁ డనియు లోకోన్నతం
బగుమహాపరాక్రమముచే నలుఁడు మున్నగువారివలెనే శత్రు
వుల నుసుమాడి మహావనంబునఁ దండ్రికి గీర్తిఁగూర్చు
చుండెననియు శివునకుఁ బరమభక్తుఁ డనియు మహారాజ
లక్షణంబులచేతను సద్గుణగణంబులచేతను గొనియాడఁదగిన
సుకుమారుం డనియు, దానంతకుమున్నే యెఱింగి యున్న
వాఁడు గాన రాజులకుఁ బరమభూషణం బగువిక్రమముచే
ప్రసిద్ధి గాంచినయాతని నెట్లయిన నల్లునిగాఁ జేసికొన
నువ్విళ్ళూరు చున్నను బుత్రికావిషయ మన భీతి కలవాఁ
డగుటచే నాతనియాయుర్దాయ మెట్లుండునో యని సంశయిం
చుచు "గురుబుద్ధి ర్విశేషతః" అని యుండుటంజేసి తన యా
లోచనకు గురునిబుద్ధి విశేషసహకారి యగునని యెంచి
మహాప్రభావసంపన్నుండగు యాజ్ఞవల్క్యునికడ కేగి సవిన
యంబుగా నమస్కరించి నిలువంబడి యంజలి ఘటించి యిట్లు
విన్నవించెను. "గురువరేణ్యా మీరుసర్వజ్ఞులు మీకు
నాయందుఁ బుత్రవాత్సల్య మున్నదని యెఱుంగుదును.
ఇప్పుడు మనసీమంతినికి దీర్ఘాయుష్మంతుఁ డగువరుని నిర్ణ

యుండవలసి యున్నది. మీకుఁ దెలియని విషయములు లేవు గావునఁ జంద్రాంగదుఁడు తగియుండు నేమో. దివ్యదృష్టింబునఁ బరిశీలించి యానతీయ వేఁడెద" నని మున్ను జ్యోతిష్కుఁడు వ్రాసిచ్చినశుభమంగళవిషయమును దెల్పి ప్రార్థింపఁగా యాజ్ఞవల్క్యుఁడు దివ్యదృష్టిచే గాంచియు నెఱిఁగి "రాజోత్తమా! యీసంబంధము తగియే యున్నది. సీమంతినిని జంద్రాంగదున కొసఁగుటయందు సప్రయత్నుండ వగుము. సంశయింపకుము" అని సెలవొసంగినఁ జిత్రవర్మ హర్షించి యంతట మందిరంబు చేరి స్వజనములతోఁ గూడ నాలోచించి ఇంద్రసేనునకు దగువారివలన సమాచార మంపెను. ఇంద్రసేనుఁడు చిత్రవర్మ కులశీలగౌరవంబుల నెఱిఁగిన వాఁ డగుటవలన, నవదలకే సీమంతినీవిషయమున సంకల్పము గలవాఁ డగుటంబట్టియు గురుబంధుజనుల యిష్టానుసారముగాఁ జంద్రాంగదునకై యాకన్యకను గొనుటకు సమ్మతించెను. కాకతాళన్యాయముగా నందఱియుద్దేశములు నేకీభవించి ఫలించినవి.

శుభముహూర్తము నిశ్చయింపఁబడినది. వివాహప్రయత్నములు జరుగుచున్నవి. ఆర్యావర్త మార్యావృత మైనది. చిత్రవర్మమందిరము పచ్చతోరణముల మున్నగు శుభలక్షణములతోఁ జిత్రముగా నలంకరింపఁబడి కళ్యాణకలయ మైనది. గురు బంధుమిత్రపరిజనంబుతో విలసిల్లు చున్నది. అపుడు నిషధమహీపతి మహావిభవమం

పన్నుఁడై మంగళవేదఘోషపురస్సరంబుగా వరియించెను. అంతట మున్నె మంగళాలంకృతు లగువధూవరులను దత్సమయమున మంగళస్నాతులఁ గావించి వివిధశృంగారంబులచే దేదీప్యమానవివాహవేదిపై గూర్చుండఁబెట్టిరి. పురోహితులు స్వస్తిపుణ్యాహవాచనంబులఁ గావించి విధ్యుక్తమంత్రములచే వివాహక్రియల నడపుచుండిరి. భూసురులమహదాశీర్వాదనాదంబులుఁ భేరీమృదంగాది శుభవాద్యములరావంబులు, వేణువీణాదులమధురనినాదంబులుఁ గాయకగణికాదులసంగీతరవంబులు, మిన్నుముట్టుచున్నవి. అత్యుత్తమం బగు సాలంకృతకన్యాదాన మొసఁగి మనోరమాచిత్రవర్మలు తమజన్మము సార్థక మయ్యెనని యుప్పొంగిరి. బ్రాహ్మణాదులు మృష్టాన్నపానంబులతో సంతృప్తులైరి. నగరము స్వర్గపురంబై యున్నది. అంత వధూవరులు సలజ్జావలోకనాదులచే మనంబుల హర్షించుచు హోమాదికృత్యంబుల నెఱవేర్చిరి. సలక్షణముగాఁ బరిణయ మైనది. చిత్రవర్మ యల్లునకు దివ్యభూషణాంబర ధనకనకగోసహస్రాదుల నర్పించెను. కూఁతునకు నుచితముగ బుద్ధులు సెప్పి కొలఁదికిమిగిలినయురణంబుల నొసంగెను. అంతట నింద్రసేనుఁడు సబంధుకంబుగా వియ్యంకునివలన గౌరవింపఁబడి ప్రీతుండై కుటుంబబంధుమిత్రాదులతోడను, కొడుకుకోడండ్రతోడను గుండిపీపురంబుఁ జేరి గృహప్రవేశమహోత్సవముఁ గావించెను. ఎల్లరకు నానంద మొదవెను.

సంబంధవశమునచే నగ్నికి వినుమునకును సమ్మెటదెబ్బలు సంభ
వించునట్లు సీమంతినీచంద్రాంగదులకుఁ గష్టములు కలుగఁ
బోవుచున్నవి. అల్లుండ్రకు మామగారియింట నుండుట
సుఖతర మనియుఁ, గావుననే శ్రీమహావిష్ణువు క్షీరసాగరు
నింటను, మహేశ్వరుఁడు హిమవంతునింటను వసియించి రని
యుక్తిపరులు చెప్పెదరు. ఈవచనమున కనుగుణముగాఁ
జంద్రాంగదుఁడు వివాహానంతరమునఁ గొన్ని మాసములు
శ్వశురగృహమున నుండెను. అందు సజ్జనులతో సత్కథా
సారాంశములను, సవయస్కులతో వినోదాలాపములను,
మంత్రిప్రధానులతో రాజ్యాంగరహస్యములను, మహావీరు
లతో యుద్ధకళావిశేషంబులను, బ్రహ్మజ్ఞులతో నీశ్వరభక్తి
ప్రాశస్త్యంబును గూర్చి ప్రసంగించుచు సర్వజనశ్లాఘా
పాత్రుం డయ్యెను. ఉత్తములు సర్వత్ర పూజనీయులు గదా!

ఆర్యావర్తమునఁ బ్రవహించు కాళిందీనది చిత్రవర్మపు
రమున కానుకొని స్వల్పదూరమున నున్నది. దానినే
యమునానది యనియు, సూర్యునివలనఁ బుట్టుటచే సూర్య
తనయ యనియు నార్యులు వ్యవహరింతురు. ఆపుణ్యానది పురీ
కాంత ధరించిన చీరెయో యన నీలవర్ణము గలనీటితోఁ
బురిచుట్టి ప్రవహించుచుఁ బతితపావని యని ప్రసిద్ధి గాంచెను.

అతిశయించి నావలినొప్పుచున్న సుందరతరము లగుసైకతము లును, విశాలవృక్షములును, కుసుమశోభితములై పరిమళము వెదజల్లు లతానికుంజములును, మధురఫలభరితము లగు నారికేళవనములును, గలిగి చూచువారి కెల్ల నానందము వెల్లిగొల్పుచు విహరింప నెంచువిలాసవంతుల కింపు నింపు చుండెను. ఒకదినమున సాయంకాలసమయమున మిత్రులతో వినోదముల సల్పువాచంద్రాంగదునకుఁ బ్రాగ్భాగమునఁ గాబోలు సవయస్కులతో యమునయందు నౌకావిహారము సలుపవలయుననియు, నావలిదరి కరిగి యందలివిశేషములఁ గనుఁగొని రావలయుననియు నిచ్చవొడమెను. అప్పటికి సూర్యతాపము చాలవఱకు నుపశమించినది. రండురండని పిలువవచ్చెనో యనఁ జల్లని పిల్లగాడ్పులు మెల్లమెల్లన వీచుచు పైఁబైకి వచ్చుచుండెను. అట్టియెడ నదీవిహారమునకై నిగ నిగలుచులతో మెఱయు నౌకపడవను సిద్ధము చేయునట్లు నియమించి చంద్రాంగదుఁడు సతినియనుంగుమిత్రులును మల్లెపువ్వులవలెఁ దెల్లనికాంతులతో దేజరిల్లు వలిపెంపువలువలఁ దాల్చి, సింగారములఁ దుఱంగలించు నంగీలందొడిగి పట్టుపట్టంబులతోఁ జుట్టఁబడిన శిరోవేష్టలం దాల్చి రత్నభూషణాలంకృతులై నవమన్మథులో యనునట్లు వెడలి వచ్చి నౌకపై నెక్కిరి. ఆపడవ చిన్నది. తరంగములు వింతవింత లగువదములం బాడుచు దానిని దెడ్డతో నెట్టుచు వినోదముగ నడుపుచుండిరి. ఉపవనము లోనికొండ ఆూరు

దూర మయ్యె ననుచు, దిక్కులు చూచుచు, నీటిగాలి కానందించుచు సంగీతములం బాడుచు నావలిదరిని గలమధుర ఫలంబుల నీకు దొలక నీక నే నే భుజింతు నని యుల్లసంబు లాడుచు, సుగంధకుసుమముల నిడినాప్రియురాలికోపంబు డీర్తునని విలాసోక్తులాడుచు, నిట్లు పలువిధంబుల సంతోషంబుల వెల్లడించు చుండిరి. అపుడు చంద్రాంగదుండును మిత్రులును లోకవార్తల ముచ్చటించుచుఁ దరంగిణీప్రవాహము వర్ణించుచుఁ బరిమళమిళితంబై తుంపురుల వెదజల్లునదీపవనంబునకు మనోరథపరంపర లుప్పతిల్ల వినోదించు చుండిరి. పడవ నదీమధ్యమున చేరినది. మొదట సుఖ ప్రదముగా వాయువు వీచినది. క్రమముగా గాలి చెల రేగినది పడవ కుమ్మరిసారెవలె సుడితిరుగుట కారంభించినది. రాజపుత్రుల హృదయములందు భయ మంకురించినది. గాలితగ్గలేదు. చీకటి పడినది. దరిజేరుట మన్న సాధ్యముగాలేదు. రాజనందనులకు భయ మతిశయించు నట్లు నావ యుయ్యేలవలె నూగు చున్నది. రాజపుత్రులు తల్ల డిల్లిరి. వారి సంతోష మడుగంటినది. ప్రాణములవిషయమై సంశయమే కలిగినది. వా రెటు లొరిగిన పడవ యటుల నొఱుగుచున్నది. వారిగుండెలు కొట్టుకొను చున్నవి. ఎంత ఘోర మెంత ఘోరము! మహాప్రళయ మాసన్న మయినది. మున్ను తృణావర్తుఁ డనురక్కసుండు బాలుఁ డగు శ్రీకృష్ణుని గొంపోయి నట్లు ఝంఝూవాతము

పడవతోఁ గూడ వారలను బైకెత్తుకొనిపోయినది. ఆకసము బోయినది. పడవ మఱల నచ్చటనే పడినది. ఒఱిగినది. భోరగిలపడినది మునిగినది. అక్కటక్కటా! అందఱు నందు గూలి మడిసిరి. ఏమి కాలగతి! ఎట్టివారికైనను ప్రారబ్ధ మనుభవింపక తప్పదు కదా! నరంగులలో నిద్దఱు ముగ్గురు మాత్రము మొండిధైర్యముతోఁ దెప్పలతోఁ గొట్టుకొనుచు నెట్లెట్లో గట్టుంజేరిరి. రాజ పుత్రులందరును మృతి నొందిరి. చంద్రాంగదుఁడు గూడమరణించెను. మృత్యుదేవత కందరును నమానులే కదా!

జగతిబుధునందు మూర్ఖుడౌ జనునియందు
బలముగలవానియందు దుర్బలునియందు
ఘనధనాఢ్యునియందు నిర్ధనునియందు
సమముగా మృత్యుదేవత సంచరించు

హతశేషులు ప్రాణములతో నెట్లెట్లో బ్రతికి చని యాఘోరవార్తను జిత్రవర్మాదుల కెఱిఁగించిరి. వా రామహా దారుణవృత్తాంతము విని హాహాకారంబులఁ జేయుచు రోదనము చేసిరి. పౌరు లీవార్తను విని "కటకటా! మనరాజున కెంతకష్టము సంభవించెను. ఎంతో మహోత్సవముతో నిన్న గాక మొన్న పెండ్లి జేసిన రాజున కింతశోకము గలిగెఁగదా" యని విలపింపఁ దొడఁగిరి. సీమంతిని కీపిడుగువంటి వార్త తెలిసినది. ఆమెదుఃఖమునకు మేరలేదు. పాపము కష్టమను నదియెట్టిదో యెఱుఁగని యాపసిబాల కిట్టి దురవస్థ వాటిల్లి

నది. ఆమె కంటినీరు కాల్వలై పారుచున్నది. ఎంద రోదార్చినను నిలుపలేదు. ఏమ్చిన నేమి ప్రయోజనము! ఆమె రోదన మరణ్యరోదన మయినది. కొండనుండి దొరలు ప్రవాహమువలె నాతికిని దుఃఖ మాపరాకయుండెను. ఇట్లే కాలము గడుచుచుండెను. పాపము సీమంతిని కలంకారముగూడ సమాప్తముగు కాలము వచ్చినది. కళకళలాడు తీఁగె వాడి కృశించినది. ఆకులును పువ్వులును రాలిపోయినవి. తనవా రెల్లరు నిషేధించుటచే సీమంతిని సహగమనమును మానెనుగాని సోమవారవ్రతము సల్పుచునే యుండెను.

ఇది యిట్లుండ నీభీషణవార్త యింద్రసేనునకుఁ దెలిసినది. ఏకపుత్రుఁ డగువాని దుఃఖ మేమని చెప్పవలయును! గుండెపగిలినది! అతఁడు మూర్ఛిల్లెను. ఆదంపతులకు లోకమే యస్తమించినది. నోరుచుట్టుపై రోకలిపోటన్నట్లు శత్రు రాజులు పైఁబడి యింద్రసేనుని బంధించి మంత్రులు మొద లగువారిని సర్జించి వసుధను తమవశము జేసికొని యేలఁ దొడఁగిరి. ఇంద్రసేనుఁడు రాజ్యము పోయినను, నందరు బద్ధు లయినను గణింపలేడు గాని పుత్రశోకదుఃఖమును భరింపజాలకుండెను. ఏమి కాలగతి. మానవులకు సంపదల రాక పోక లతిచిత్రములుగదా!

సిరి దా వచ్చిన వచ్చును, సరభసముగ నారికేళ సలిలము భంగిన్
సిరి దాఁ బోయినఁ బోవును, కరి మ్రింగిన వెలగపండు గదరా సుమతీ!

నాగలోకమునకు భూలోకమునకును రాకపోకలకు యమునా నదిలోనుండియు, గంగానదిలోనుండియు, మార్గములు కలవు. కాని దానిని నాగలోకవాసులే యెఱుంగుదురు. ఒక్క యెడ గొందరు నాగకన్యకలు పుడమిపైకి వచ్చుచుండిరి. వారికి దారిలో నొకపురుషుండు కనిపించెను. అతండు నిశ్చేష్టితుండై యుండెను. వాని సౌందర్యము కుమారికల కద్భుతము గొల్పెను. వార లతని గంధర్వుండో యక్షుండో దేవపుత్రుండో యని వెరగుపడి చూచి యాతని వృత్తాంతం మడుగం గోరి యతివినయముతో బల్కరించిరి. కాని యాతం డేమియుం బలుక లేదు. అంత నాకన్యకలు వానిని సగౌరవముగాం గొనిపోయి తమయేలిక ముందునిచి వానిసంగతి ప్రభువునకెరిగించిరి. అది మానవ లోకము కాదు, పాతాళలోకము. అందనేకశిరంబులు గలసర్ప రాజు లుందురు. వారు కామరూపులు. ఆలోకమున సూర్య చంద్రప్రభలు లేవు. సర్పములపడగలం గలమాణిక్యముల కాంతులు కోటి సూర్యప్రకాశము నొదవించును. అందలిప్రదే శము రత్నమయము. అందు వజ్ర వైడూర్యాదులచే నిర్మిం పబడిన దివ్యసౌధములు వెలుగొందు చుండును. దానిసోయగము స్వర్గమును దిరస్కరించు చుండును. అది హేమద్వార కవాటములై మాణిక్యగోపురసమలంకృతములైన దివ్యభవన

బులచే నేత్రపర్వంబు గావించు చుండును. కొంద అజ్ఞులై యందలిభుజంగములు మానవులను జంపునవియు, నది దుష్ట లోకమనియు, నం దరిగినవారు మరలఁ బ్రతికి రానేరరనియుఁ జెప్పుచుందురు. అందలినాగకుమారులనపరాధులజోలికెప్పుడును రారు. వారు దివ్యపురుషులు, పుణ్యాత్ములు. ఆలోకము మహాపుణ్యవంతులకే గోచర మగును గాని సామాన్యులకుఁ జూడ నలవిగాదు. అందలి ప్రభువు తక్షకుఁడు. కొందఱతనినే శేషుఁ డందురు. ఆయుత్తముం డతిరూప లావణ్యసమేతుండై దివ్యాభరణ భూషితుండై యొప్పుచుండును. అతఁడు మహా పుణ్యమూర్తి. ఆమహానీయుని నాగకుమారులు నాగకన్యకలును సేవించు చుందురు. ఆభుజగేంద్రుని బరమేశ్వరుఁడు భూమి జలార్ణవంబు గాకుండ నుద్ధరించుటకై యందు నిలిపెను. అతఁడు మహాదయాళువు.

ఆతక్షకుని యెదుట నాపురుషుఁడు భయపడక సధైర్యముగా నిలిచి యుండెను. వానిరూపలావణ్యమహారాజలక్షణంబులఁ గాంచి యచ్చెరు వంది తక్షకుఁ డిట్లనియెను. "మహాత్మా! నీవెవరవు? ఈలోకమున కేల వచ్చితివి. తెలుపు" మన నతండు నమస్కరించి యిట్లనెను. "మహాత్మా, భూమండలమున నిషధ దేశప్రభు వగు నలచక్రవర్తి యను రాజు గలఁడు. ఆలోక పూజ్యునియశము దశదిశావ్యాప్తము. ఆపుణ్యాత్ముని యశ్వమేధాదిమహాక్రతువు లొనర్చి ప్రతిష్ఠించిన యూపస్తంభంబులు నవద్వీపములయందును నిండియున్నవి. ఆ యుత్తమపురుషుని

పేరు విన్నంతనే కలిభయంబు కలికానికైనఁ గానరాదు. ఆమహారథుఁడు. ఆబ్రహ్మవేత్త, ఆదేవతాపూజ్య మాన చరణారవిందుఁడు నాకుఁ బితామహుఁడు. ఆశుభలక్షణమున కష్టాంగలక్ష్మి యై పతివ్రతాతిలక మగు దమయంతియందు జనించినజనక సమానుఁ డగు నింద్రసేనమహారాజున కేను పుత్రుండను. నన్ను చంద్రాంగదుఁడందురు.

"ఏను యమునాజలంబుల విహరించుచు దైవయోగమున నీలంబు బడి పుణ్యాత్ములగు నీపన్నగ స్త్రీల మూలమున దేవరదర్శనంబు సేయఁ గాంచితి. జన్మాంతరమహాపుణ్యమునఁ బుణ్యమూర్తులగుమీశుభాకారమును గాంచి ధన్యుఁడ నైతిని! నాపితరులుంగూడఁ గృతార్థులైరి. లోకేశ్వరా! నీవుస్థావరజంగమ రూపము లగు వస్తుజాలముల కునికి పట్టగుభూమండలము నంతయు ఫణాగ్రమున మోయుచున్నమహాబలుఁడవు. స్వామీ! పురాణములయందుఁ బరమేశ్వరునకుఁ గర్ణకుండ మనివర్ణింపఁ బడునిన్నుఁ జూచు మహాభాగ్యము నేఁడుగదా నాకుఁగలిగినది. ఏ దేవుఁడు సర్వదేవులలోను మహాదేవుఁడని యెన్నఁబడు చుండెనో ఏ దేవుని తేజమునెదుటనూర్యాగ్నుల తేజము పర మాణుప్రాయముగాఁ గనుపట్టునో ఏదేవుఁడు మోహాపరవశులకు దూరస్థుఁడయ్యును భక్తులకుసమీపస్థుఁడగు చుండునో అట్టి పర మేశ్వరుని, చిద్రూపుని, శాశ్వతుని, సర్వశక్తుని, దయామయుని,

నిరంతరము ధ్యానించువాఁడ. ఏయీశ్వరునిభక్తి మనంబున నంకురించి కలయంబర్వి యానందామృతమును గ్రమ్మరింప యోగీంద్రులు బ్రహ్మలోకంబునన్నైన నిచ్చగొనక బ్రహ్మానంద పరవశులగుదురో యట్టి దేవునే స్మరించువాఁడ!"

అని యిట్లు నుడువుచు ధ్యానవశంబున భక్తిపారవశ్యంబున నోడ లెఱుఁగక తన్మయత్వంబు నొంద నాతనివరమజ్ఞానమునకుఁ దక్షకుఁ డత్యద్భుత నుంది యి ట్లనెను. "బ్రాహ్మణోత్తమా! నేను నీమనోనిశ్చయం బెఱింగితి. నీవు మహాజ్ఞానసంపన్నుఁడవు. మహిమనవురము నీశ్వరభక్తులను. ఇంతియగాక నేనుమాట లాడిన, నేనుపదంబులు కూడ నడిచినఁ నెట్టివారును మిత్రు లగుదురు. కావున మన మింక మిత్రులమనుటకు సందియ మేమి? ఇట్టిసఖుండవు నీవు లభించుటంజేసి నాయానందమునకు మేరలేకున్నది. ఈ లోకముపరమసుఖాస్పదము, రత్నమయము. ఇందున్నవన్నియుఁ గోర్కెలొసఁగుకల్పవృక్షములు. ఇందలిజలంబు సాక్షాదమృతంబు. ఇందలిస్త్రీపురుషులు లోకాతీత సుందరులు. ఇచ్చట నుండువారికి జరామరణరోగభయంబు లుండవు. కావున నీవిచ్చవచ్చిన ట్లింద యుండుము. ఇచ్చట నీ కే లోపంబును గలుగదు." అని ప్రీతితో నుడివినఁ జంద్రాంగదుండు సంతసించి యంజలి మోడ్చి యిట్లనియె. మహాత్మా! దేవర యాజ్ఞానుసారంబుగా వర్తించుటయే మర్యాద. అయినను

నామనవిని దేవరదివ్యచిత్తంబున నవధరింప వేఁడెద. ఏను కొలఁదిమాసంబులక్రిందట గృహస్థనియమం బవలంబించితిని. నాభార్య వ్రతశీలయై శివపూజాపరాయణ యై యున్నది. నేను గనిపింపనిచో జీవింపనొల్లదు. మఱియు నాతలిదండ్రుల కేనొక్కఁడనే తనయుఁడను. కాళిందీజలంబులఁ గూలితిని. నేఁ గనిపింపకుండుటఁ జేసి నన్ను మృతునిగా నెంచి పుత్రవ్యామోహంబున వారు మృతు లయ్యెదరు. కానిచో బలాత్కారంబుగానైన నసురులందొఱఁగుదురు. కావున నన్ననుగ్రహించి సెలవిచ్చి పంపవేఁడెదను"

తక్షకు, డాతనిమాటల కనుమోదించి చంద్రాంగదున కనేకదివ్యాంబరభూషణాదులను రత్నసువర్ణాదులను నొసంగి కామగమనము గలహయంబు నిచ్చి యొకనాగకుమారుని, రాక్షసునిగూడఁ దోడొసంగి సగౌరవంబుగా ననిచెను. అంతఁ జంద్రాంగదుఁ డయ్యశ్వంబు నధిరోహించి యనుచరులతోడఁ గూడి సంకల్పించినమాత్రముననే మనోవేగంబున నాతురంగరాజంబు వారలఁ జిత్రవర్మపురసమీపంబునకుఁ జేర్చెను. ఆరసాతలలోకంబున నుండుటంగాఁబోలు చంద్రాంగదుఁడు నవీనసుందరాకారుండై వచ్చి నిశ్వేశ్వరపురసమీపంబున నుండువనంబు చేరువ నాఘోటకంబు డిగ్గియందు సుఖంబుగా విహరించుచుండెను. ఉత్తములఁ జెలిమియొదవిన నెంతయౌన్నత్యమునైనఁ గూర్చునుగదా!

నీరము తప్తలోహమున నిల్చి యనామక మై నశించు, నా
నీరమె ముత్యమట్లు నళినీదళసంస్థిత మై తనర్చు, నా
నీరమె శుక్తిలోఁ బడి మణిత్వముఁ దాల్చు సమంచితప్రభం,
బౌరుషవృత్తు లిట్లధమ మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్.

## ౧౦

సమానపరిమితి గలకాలము సుఖవంతునకు నిమేషమాత్రముగాఁ దోఁచి దుఃఖవంతునకు సంవత్సరప్రాయముగాఁ గనుపట్టును. దేవతల కత్యల్పముగాఁ దోఁచుకాలము పితృదేవతలకంత కంటె నెక్కువగా మానవలోకవాసులకు మఱింత యెక్కువగానుండును. అందువలననే మనసంవత్సరకాలము పితృదేవతల కొకదినమగునని యు, మనము ప్రతిసంవత్సరము శ్రాద్ధముననన్న మొసంగితి మేనిఁ పితృదేవతలకుఁ బ్రతిదినము నది యొసఁగినట్లె యగునని యుఁ బురాణములయందుఁ జెప్పఁబడి యున్నది. కావున నటులనే సుఖమయంబగు నాగలోకమునఁ జంద్రాంగదునకుఁ గడచినస్వల్పకాలము మానవలోకమున సంవత్సరమైనది. అట్టివత్సరకాలము సీమంతినికి నూఱు వత్సరములుగానుండు ననుట యాశ్చర్యము కాదు. చంద్రాంగదుఁడు మరలి వచ్చి యచ్చట నున్నదినంబు సోమవాసర మగుటంజేసి

సీమంతిని నాఁడు స్నానార్థముగాఁ జెలికత్తెలతోఁ గూఁడ నచ్చటి కరుదెంచెను. అప్పుడు చంద్రాంగదుఁడు కంఠసూత్రంబు లేక, భూషణంబుల వర్జించి, కనులయందుఁ గాటుక కనుపట్టక, కేశసంస్కారశూన్యయై కుంకుమశోభితంబు గాక దీన మగుమోముతో మేఘావృత మయిన చంద్రకళ వగిది దుఃఖావృతయు నలంకారవిహీనయునగు నామెను జూచి తనభార్య యగు మెఱింగి సమీపించి సఖితో నిట్లని యెను. "ఓమత్తకాశిని యీయామె యెవ్వతె? ఈసుదతి తలిదండ్రులపేరేమి? ఎచ్చటినుండి యెం దరుగు చున్నయది? ఈసతి యెవనిభార్య? కడుబాల్యముననే యిట్టి వైధవ్యదుర్దశ ననుభవించు నీమెను జూడ నాకు మిగుల జాలి వొడముచున్నది. అక్కటా, దైవ మీయామెయెడ నెంతక్రూరుఁ డయ్యె ఈయువతివస్థితి నెఱింగింపు" మన దాసి సీమంతినీ వృత్తాంతమును నివేదించి యీయామె వ్రతస్నానంబున కేగుచుండుట దెలిపెను. దాని విని యీయామెదుర్దశకై వగచుచున్నట్లు గన్పట్టు నాపురుషుని ముఖలక్షణంబులఁ గన్నారఁ జూచి తానెన్నడో చూచిన పురుషునిగా నెంచుచు మనంబున నేమియో తలపోయుచు సీమంతిని యిట్లనెను. "మహాత్మా! మీ రెవరు? మీతో గూడ సంచరించు వార లెవ్వరు? మిమ్ము దర్శింప దేవగంధర్వులో యక్షకిన్నరులో యని తోఁచుచున్నది. మీ కీదీనురాలివృత్తాంత మేల? ఇంతకు మున్నెన్నడైన మీరు నను జూచి యుంటిరా.

నేను మి మ్మెప్పుడో చూచి యున్నట్లు పొడకట్టు చున్నది. మీ రిప్పు డిచ్చటి కేల వచ్చితిరి ?" అని గుర్తింప జాలక పరిచయము గలదాని పగిదిఁ బలికినఁ జంద్రాంగదుండు "ఓవరవర్ణినీ ! మేము దేవ సంబంధులము. ఇచ్ఛవచ్చినట్లు ప్రవర్తించు చుందుము. మే మొకచోటికిఁ గార్యవశముచే నేగుచు నిందొకపని గలిగి యిచ్చట నిలిచితిమి. నీతోఁ గొన్ని సంగతులు తెలుపవలసియున్న" వని యాసుదతిని సమీపించి యామె చెవిచెంతఁజేరి రహస్యముగా నిట్లనెను. "ఓగుణవతీ! నీహృదయేశ్వరుఁ డొకానొక లోకమునం దున్నవాడు. ఆతని వృత్తాంతమును నే నెఱుఁగుదును. నే నిప్పుడాయనయొద్ద నుండియే వచ్చుచుంటిని. నీవు సల్పెడివ్రతమహిమనుబట్టి త్వరలో నీయొద్దకు రా నున్నాఁడు. ఇంక రెండు మూఁడు దినములలో నీదు దుఃఖము తుదముట్టఁ గలదు. తాను వచ్చెడి వార్తఁ దెలుపు మని నీ హృదయేశ్వరుఁడే నాకుఁ దెలిపి పంపెను. ఇది యసత్యము గాదు. సందేహము వలదు. ఇది పరమ రహస్యము. దీని నెవరికిం జెప్పవలదు" అని యొట్టు పెట్టించుకొనియెను.

అంత సీమంతిని యిట్లు వితర్కింపఁ దొడఁగెను. ఆహా! ఇమ్మహాపురుషునివాక్య మద్భుతమై యపూర్వముదం బొసఁగు చున్నది. ఈయన యెవ్వరై యుండనోపు ! ఎందుండి వచ్చెను! విలాసయుక్తమగు చూడ్కుల నాపైఁ బఱపుచు మున్నెఱింగిన వానివలె సరస వచనముల నన్నుగ్గడించు చున్నాఁడు.

తాను నడుపునది యసత్యము గాదనెను. నాభర్త మఱల వచ్చునని తెలుపుట యాశ్చర్యమును గలిగించు చున్నది. నా హృదయేశ్వరుఁ డెట్లు రాఁగలడు ? ఇంతవనుక నెందైన నుండి వచ్చు నను కొందునా? యేటిలోఁ బడినట్లు పడవ వాండ్రు చూచితి మని నుడివిరి. ఎటులైన తప్పించుకొని వచ్చునేమో యన నిప్పటికి సంవత్సరకాలము మించినది కదా! ఇంతకాల మెట్లు బ్రదికి యుండును? తనతో గూడ జచ్చినవారలు రాక యున్నఁ దానెట్లు రాఁ గలఁడు. అట్లు గాక యపుడే తాను మాత్రము జీవించి యెందో దాఁగియుండె నందునా యింత కాల మిట్లు జాడ నెఱిఁగింపక రహస్యముగ నుండనేల? ఏమి నాకీ వెఱ్ఱి! ఆ పుణ్యాత్ముడు మరల వచ్చుననుట యసంభవము. మృకండగుట యే నిక్కము. బ్రదికి వచ్చునందునా చచ్చిన వారలెట్లు బ్రదికి వత్తురు? అసత్యమను కొందునా యీ మహాత్ముఁడు కల్లలాడు వానివలెఁ గన్పట్టఁడు. నాహృదయేశ్వరుఁడు రెండుమూఁడు రోజులలో వచ్చెదనని తెలుపు మని యీతనిఁ బంపెనఁట. ఈతఁడేల యబద్ధమాడును? నిజముగా వచ్చునేమో! నాకాపాటి యదృష్టమా! ఎట్టి పుణ్యవతుల కట్టి యదృష్టము సంభవింప వలయును! ఇందలి సత్యాసత్యముల నే నెట్లును నిర్ణయింపఁ జాలకున్నదాన! శిశిరఋతువునఁ బ్రాతఃకాలమున మంచుచే నావరింపఁబడిన కమలమును తుమ్మెద వదలుటకును గ్రహించుటకును జాలనియట్లే యీ వృత్తాంతమును నమ్ముటకును నమ్మకుండుటకును జాలకున్నదానను. ఏమన

దగునా?" అని సంధిగ్ధహృదయయై తన కిట్లు నిర్ణయించెను. అట్లు గాదు. ఆపురుషుఁడే నాప్రాణేశుఁడు. ఎట్లో బ్రతికి మరలి వచ్చెను. లోకాంతరమునుండి వచ్చుటచే రూపము మాఱి యుండవచ్చును. అందుచే నేను గుర్తింపఁ జాలకున్నదాన. ఈతఁడు నావిభుఁడు కానిచో నాకెంగేలు పట్టుకొనవచ్చి నాచెవిచెంతఁ జేరి ముచ్చటలాడుచున్నట్టులు నిశ్లేల చెప్పును? ఇపు డీయనంజూడ నానెమ్మది మరలక యీతనియందే ప్రేమ యుక్తమగుచున్నది. పతి కానిచో నన్య పురుషుఁగని నాహృదయ మీతనియందేల చొచ్చును? ఈ సుందర వదనారవిందము, నీవిశాల వక్షము, నీయెగుభుజములు నీనవమన్మథాకారము, నాహృదయేశ్వరునిదే. సందియములేదు. నదిలోఁగూలినను నెటులో మరల బ్రతికి వచ్చి యుండనగును. ఆయువు గట్టిది యైనచో మఱల బ్రతికి రాఁ దగును గదా! మఱియు నీతఁడు ప్రతమహిమకు సంతసించి రాఁగలఁడని నుడివెను. కావున నాప్రత దేవతలు నాపెనిమిటిని బ్రతికించి రప్పించి యుండవచ్చును. మాయమ్మ మైత్రేయి ప్రతముచే నెట్టియాపదలైనను దొలఁగి శుభము కలుగునని నుడివినది. ఆమహాదేవి వచన మనృత మగునా? దేవతలను గ్రహించి మఱల నాకు నాభర్తను గూర్చిరి. ఇట్లగుట గౌరీదేవతా ప్రసాదమే. నేను దీర్ఘ సుమంగలి నగుదునని మున్ను మా తండ్రితో మొదటి జ్యోతి

ష్కుఁడు వాక్రుచ్చెనఁట. ఇట్లగుననియే కాఁబోలు. మహాత్ములవాక్యములం గలయర్థ మెఱుఁగుట యశక్యమైనను ఫలకాలమున సమన్వయ మగునుగదా! సత్యము, సత్యము" అని యిట్లు నిశ్చయించి కనులార్పక ప్రేమతోఁ జూచుచుండ నా పురుషుఁడు "భయ మందకుము. మఱల వచ్చెదను" అని హయము నధిరోహించి తనవారితోఁ గూడ నరిగెను. ఆహా యేమి యీశ్వరమహిమ!

సిద్ధిగానిపనుల సిద్ధింపఁ జేయును
సిద్ధమైనపనులఁ జెఱచుచుండు
జనుఁడు తలఁప నట్టిపనులకు దైవంబు
ఘటితమైనవానిగా నొనర్చు.

## ౧౧

పాపము! అక్కడ నింద్రసేనుఁడు శత్రువులు రాజ్యము హరించిన దుఃఖమువలనను, విశేషించి యేకపుత్రుఁ డకాలమృతుఁ డైన దుఃఖము వలనను వివశుఁడై శత్రువులచేఁ గట్టబడి శోకము మునిఁగి చచ్చిన వాని వగిది నుండెను. ఇట్లుండఁ జంద్రాంగదుఁడు రాక్షసనాగకుమారులతోడ నచ్చటికరిగి యా సంగతి నెఱిఁగి నాగకుమారునకుఁ గొన్ని విషయములు తెలిపి శత్రువులకడ కంపి తానాపురవనమున విహరించుచుండెను.

సింహాసన మధిష్ఠించి రాజ్యము సేయు చున్న విరోధులకడకు నాగకుమారుడు చేరి "యిదె మాతేడుచంద్రాంగదుడు రసాతలమున కరిగి సర్వప్రభావసంపన్నుఁడై మఱలి వచ్చి యున్నవాఁడు ఆమహాపురుషుఁడు లేనియెడ దుఃఖవివశుఁ డగునింద్రసేనుని బంధించి మీరురాజ్యము నశముఁ జేసికొని యెంతయు ననుచితంబుఁ గావించితిరి. ఇంతట నైనమీకు జీవితాశ యుండెనేని నిచ్చటనుండకతొలఁగుఁడు. కానిచో మీప్రాణవాయువు లమ్మహాశూరుని బాణభుజంగంబుల కా హారము కాఁబోవు చున్నవి. ఈసంగతి మీతోనుడువ మా ప్రభువు నన్ను మీకడ కనిచెను. ఆధీరుఁ డిపు డీపురవెలు పలివనమున నున్న వాఁడు. ఏవిషయమును త్వరగాఁ దెలు పుఁడు" అని మంతలింప నచటివా రందఱు నబ్బురపడి యనత్యమనుకొనిరి. కొందఱు పురివెలుపలి తోటలో విహరించు చున్న చంద్రాంగదుని గాంచి యాజాడఁ దెలుప నంతకు మున్నె వారు చంద్రాంగదునిపరాక్రమాతిశయం బెఱిఁగి యున్నవారు కావున జయింపజాల మనియెంచి యాతనిపాలికి వచ్చి క్షమింపు మని పాదాక్రాంతులై వేఁడిరి. కొంద ఱీ శూరుఁడు మనల విడువక చంపు నని భయంపడి సింగమును గాంచిన మృగములకరణిఁ బలాయితు లైరి. పౌరులీ వృత్తాంతము నింద్రసేనునకుఁ దెలుప మృతుఁ డగువాఁడు జీవిం చినమాడ్కి తెప్పరిల్లి "ఏడీ ఏడీ, నాకుమారుఁ డేడీ. ఎట్లు వచ్చెను" అని తడవుకొనుచు జూచు చుండ జంద్రాంగదుఁడు

తలిదండ్రులం జేరి యభివందన మాచరించి కన్నీ వదలించి తగుమాటలచే వారల కూరట గొల్పెను. పునర్జీవితుం డయ్యె నని కనుల నానందబాష్పములు దొఱల తలిదండ్రులు దనయునిఁ గౌఁగిలించిరి. పౌరు లెల్లరు నాతని వీక్షించి పోయినకనులు మరల వచ్చినట్లు సంతసించు చుండిరి. విపత్తు డొక్కఱుఁడును గానరాకుండ సంతసము చ్చె చనియె. అంత నీవృత్తాంతము నార్యావర్తమున బ్రకటింపఁ జిత్రవర్మా దులు మేఱలేనిసంతసముతో నేతెంచి చంద్రాంగదునిదర్శించి యమృతపానము చేసినవారికరణి నిరుపమానందభరితులై వానిం గౌఁగిలించిరి. అందఱకు నానంద మొదవెను. అట్టియెడ చంద్రాంగదుఁడు పౌరబంధుగురువృద్ధసంయుతం బగుసభామధ్యమున నెల్లఱకును దెలియునట్లు తనను నాగకు మారికలు తక్షకునిసమ్ముఖంబునకుఁ గొంపోవుటయుఁ దల్లోక సౌందర్యవిశేషంబును, దక్షకుఁడు తన్ను గౌరవించి ధన కనకవస్త్రాభరణాదు లొసఁగి సబహుమానంబుగాఁ బంపు టయును, మొదలుగా గలవృత్తాంతం బెల్ల బూసగ్రుచ్చినట్లు దెలిపి యెల్లరకు నానందము గల్గించెను. అంత జిత్రవర్మ వియ్యంకుని నల్లుని బంధుజనములతోఁ గూడఁ దనపట్టణమునకు విచ్చేసి తమవారికందఱకు నానంద మొనగూర్ప వలయు నని ప్రార్థించెను. ఇంద్రసేనుఁ డందులకు మనమ్మున నలరి సపుత్రకంబుగా సముచితపరిజనంబులతో నార్యావర్త మున కేతెంచి యాపురవాసుల • నాబాలగోపాలంబుగా

మహోత్సాహ మొందవించెను. సీమంతిని తనభర్తరాక నెఱింగి నిర్భరానందమున మైత్రేయి యుపదేశించినవ్రతప్రభావముచేఁ దనకు దీర్ఘసుమంగలీత్వము గలిగె నని తనకా మహాభాగ్యము కావించిన పార్వతీ పరమేశ్వరులను ధ్యానించుచు నెవుడు మఱలఁ బ్రాణేశ్వరునిఁ జూతునా యని యువ్విళ్ళూరుచుండెను. ఇంతలో ధర్మశాస్త్రజ్ఞుల వచనానుసారముగా సఖీజనంబులు సీమంతినిని కేశసంస్కారాదులచే నలంకరించిరి. సీమంతిని యంతకుమున్నె యెట్టెట్టో సంతోషము పట్టఁజాలక చాటుమాన నుండి విభునిఁ జూచుచున్నను గనులారనెపుడు గన్గొందునో యని చంద్రచకోరన్యాయమున నుప్పొంగు చుండెను. చంద్రాంగదుఁ డట్టియెడఁ దక్షకుఁడు తనకొసఁగిన దివ్యాంబరాభరణాదుల సీమంతిని కలంకరించునట్లు సెలవొసంగఁ బరిచారికలామెకు నతిమానుషంబులగు భూషణంబుల నలంకరించిరి. అందుచే దేవలోకసుందరిని మించినచక్కదనముచే మున్నెన్నఁడును లేనిలావణ్యముచే శోభిల్లుచు నామె యానందపరవశయై యుండెను. వాడిన తీఁగె మఱలఁ బల్లవించి పుష్పించినది! చంద్రకళ మేఘాచ్ఛాదనము వదలుటం జేసి సంపూర్ణకాంతుల వెదజల్లుచు నేత్రానందము గావించినది. తదనంతరము సతీపతులిరువురును హాసలీలావిలాసాదులచే నన్యోన్యానురాగంబునఁ జరించుచు నుల్లాసముతో వర్తించు చుండిరి. మహాత్ములగు జ్యోతిష్కులవచనంబున నెట్టియర్థము గలదో. అది యిప్పుడు

గదా సమన్వితమైనది! అంతఁ జంద్రాంగదుఁడు పత్నీ సమేతముగా నిషధ కరికి పట్టాభిషిక్తుఁడై శచీసమేతుఁడగు దేవేంద్రునివలెఁ నిరంతరవైభవములవిలసిల్లుచుఁ దలిదండ్రుల కానందము గూర్చుచు రాజ్యపరిపాలనం బొనర్చుచుఁ గర్వితుఁడు గాక ప్రజానురంజకుఁడై యీశ్వరారాధనమం దప్రమత్తుఁడై యుండెను. సీమంతినియు సర్వమంగళయై వడిఁ జెలరేల్లుచు భర్తను బరమేశ్వరునిఁబోలెఁ బూజించుచుఁ బరమసాధ్వియై వ్రతంబు విడువక సలుపుచు లోకోత్తరం బగుకీర్తిచే నలరారుచు జగజ్జననివలె నొప్పుచుండెను. దేహికి శుభాశుభములు కాలవశముచే సంప్రాప్తము లగు చుండును.

౧౨

విదర్భదేశమున వేదమిత్రుఁడుఁ సారస్వతుఁడు, ననునిరువురు బ్రాహ్మణులు గలరు. వారిరువురును వేదవేదాంగ పారంగతులునుఁ బరమమిత్రులు నేకగ్రామనివాసులు నై యుండిరి. వారిలో వేదమిత్రునకు సుమేధుఁడు, సారస్వతునకు సామవంతుఁడును బుత్రులై వర్ధిల్లుచుండిరి. ఆబిడ్డలిద్దఱును సమాన వయస్కులుగా నుండి బాల్యాదిగా మిత్రత్వంబుతో నీర క్షీరంబులవలెఁ గలసిమెలసి యేకమనంబుతో వర్తించుచు

సకాలంబున గురువులకడ విద్య నేర్చు చుండిరి. గర్భాష్టమ వత్సరంబుననే చంద్రులాకుమారుల కుపనయనంబుగావించి పిమ్మట వేదవిద్యాభ్యాసంబు చేయించు చుండిరి. ఆ సంతనులును గడుబుద్ధిశాలురు. గురుశుశ్రూష చేసియైనను, గురువుకు ధనమిచ్చియైనను దా నొకవిద్యఁ జెప్పియైనను, నిమ్మూడు మార్గములచే విద్య నేర్చుకొనఁ దగు నని పెద్దలనుచుందురు. కావున నా బాలురు ప్రథమపక్షముననే యనుసరించి గురువులకుఁ దలలోని నాలుకవలె మెలఁగుచుఁ గొలఁదికాలముననే ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, సథర్వణవేదము నధ్యయనము చేసిరి. మరియుఁ దర్కము, వ్యాకరణము మున్నగు శాస్త్రములను గళలను గూడ నభ్యసించి సామాన్యూ వారలచే ధీమంతులని గుణవంతులని కొనియాడఁబడుచుండిరి. కాని వా రిల్లువిడిచి యెన్నఁడు నెచ్చటికేగినవారుగాని, యొకప్పుడును రాజదర్శనము చేసినవారుగాని కారు. కను బాల్యముననే యిన్ని విద్యలను నేర్చినవారి కెక్కడనైనఁ దిరుగు చున్నచో నిన్నివిద్యలు రాఁగలవా? వారి కెప్పుడును జదువుటయే పని. పండితులుమాత్రమే యైరి; కాని లోక వ్యావహారికజ్ఞానముమాత్రము కడుఁ దక్కువ. దేశాటనము, పండితులతో మైత్రి, రాజగృహముల కేగుట, యనేకశాస్త్రార్థ పరిశీలనాజ్ఞానము, అనునివి చాతుర్యమును గలిగించునని లోకప్రసిద్ధము. వారికిట్టివి లేకుండుటచే లోకజ్ఞానము చాలదని చెప్పనొప్పును. పదునెనిమిదిసంవత్సరముల యీడు వచ్చినది.

అప్పుడు తండ్రులు వారలంగాంచి "నాయనలారా మనమా పేదవారము. మీకా వివాహ వయస్సు వచ్చెనః! ఇంతట విద్య చాలించి యెందైన నరిగి మీవివాహమునకుఁ జాలునంత ధనమును సంపాదించి తెండు. విద్య ఇంతవఱకు చాలును. మీవిద్యా వినయాదులఁ జూచి యే రాజులయినను ధన మొసంగుదురు.

"విద్యయొసఁగును వినయంబు
వినయమునను, బడయుఁబాత్రత
పాత్రతవలన ధనము, ధనము వలనను ధర్మంబు
దానివలన, నైహికాముష్మికసుఖంబులందు నరుఁడు."

"అని చెప్పఁబడినవి. కాన ధన మార్జించి గృహస్థులై యైహికాముష్మికసుఖంబుల సంపాదింపుఁడు"

ఇట్లు బోధించినతండ్రులపలుకుల కలరి వారిరువురు విదర్భ రాజుకడ కరిగి రాజునుదర్శించి యాశీర్వదించిన రేఁడు వారల సగౌరవఁబుగా భద్రపీఠంబున నాసీనులంజేసెను. అంతట వారు తమనేర్చిన విద్యల స్ప్రతికిం దెల్పి "రాజోత్తమా! మేము వివాహ వయస్కులమైతిమి. మాజనకులు మమ్ము ధనమార్జించి తెమ్మనిరి గాన మాకు బెండ్లికి వలయునంతధన మిప్పింపుము" అనియడుగ రాజు వారిబుద్ధికౌశలత నెఱింగి యింకను వారిలౌకికజ్ఞానమును బరిశీలింపఁ దలంచి యిట్లనియెను.

"బ్రాహ్మణులారా! మీరు కకుత్థీమంతు లైనను నేను మీకు వలయునంత ధన మిచ్చువాఁడఁగాను. ఏదో కొంచె మొసఁగెదను. మీకా వివాహకార్య మగుటచే విశేషధన మావస్యకము. అధికద్రవ్యమున్ననో యెందరినో యాశ్రయించిన లభించును గాని యొకనియొూలమున సమకూరుట కష్టతరము. మీ కింతప్రయాసయేల? మీకు శ్రమ లేకయే వలయుధన మంతయు లభింపఁ గలయుపాయము చెప్పెదను. ఇక్కడికి సమీపమున జంద్రాంగ నృపాలరాజపత్ని యగుసీమంతినీ దేవి సోమవారవ్రతము సలుపుచున్నది. ఆమె మహాధర్మాత్మురాలు ఆయువతి దంపతీపూజను జేయుచుండును. అసువతి యొద్ద కేగిన చో మీకు వలయునంతధనము చేకూరఁగలదు. కావున మీలో నొక్కరుఁడు స్త్రీరూపమును, మరియొకరుండు పురుషరూపంబును దాల్చి దంపతులవలె నచ్చటికేగవలయును. అట్లైన మీ కార్యము సిద్ధించును. పొండు" అనిన వారలిట్లనిరి:—

"రాజేంద్రా! నీవు చెప్పినట్లు చేయుటకు మాకు భయ మగు చున్నది. దేవతలయెడలను, గురువులయెడలను, దలిదండ్రులయెడలను, రాజునెడలను, కుటిలవర్తనముఁ జేసినచో వారివంశము నశించు నని శాస్త్రమున నున్నది. ఇది యెట్లున్నను మేము కుటిలవర్తనముతో రాజాంతఃపురము నెట్లు ప్రవేశింపఁగలము? ప్రవేశింతుముపో మాగుట్టు బైటఁబడెనేని

మామర్యాద యెట్లు నిలుచును? ఇంక మాప్రాణములు నిలువనేర్చునే? కపటవర్తనులకుఁ గులశీలాచారవిద్యాగౌరవములు నశించును. పాపము, నింద, భయము, విరోధము, సంప్రాప్తమగును. సద్వంశమునఁ బుట్టి విద్యావంతుల మగు మాకిట్టిపని యొప్పునే? ప్రజలను సన్మార్గమునకుఁ ద్రిప్పవలసిన మీ రిట్లు బోధింపవచ్చునే?" అన రాజి ట్లనెను.

"విప్రులారా! దేవతలు, గురువులు, తలిదండ్రులు, భూపతియు, విధించిన యాజ్ఞ నెన్నఁడును జవదాఁటరాదు. దాఁటునరేని మానవుల కష్టములపా లగుదురు. మేము మీకుఁ బ్రభువులము. మామాట వినినచో మీ కెట్టిముప్పు వాటిల్లునో యోజింపుఁడు. అంతదూర మేల? మేము చెప్పిన చొప్పున నడచుకొన్నచో మీకుఁ దప్పక శ్రేయఃప్రాప్తి గాఁగలదు. నా మాటవినుఁడు". అని నుడివిన వారు రాజభయముచే నందులకియ్యకొనిరి. స్పృశించుచు గజంబును, వాసనచూచు భుజగంబును, నవ్వుచు భూనాథుఁడును, మాటలాడుచు దుర్జనుఁడును, హింసింతు రన్నట్లు రా జంతవారి నంతకుఁ దెచ్చెను. వారును రాజుమాటలకు లోనై యట్టిపాపమునకుఁ బాల్పడిరి. ఔరా లోభ మెంత చెడుగుణము. అది యెట్టి పాపమునైనఁ జేయించునుగదా!

దురితవాసమై మఱియు దుష్కృతముం గను, ద్వేషరోషవి
స్ఫురణకుఁ గూడ హేతు వగుచుం జనులోభము, దానఁ గోపముం
దోఁచయును, గోపసంగతిని ద్రోహ మొనర్చును, ద్రోహ కారి దు
స్తరనరకంబునం బడును శాస్త్ర మెఱింగినజ్ఞానవంతుఁడున్.

అంత రాజాజ్ఞచే సారస్వతుని పుత్రుఁ డగు సామవంతునికి సేవకులు స్త్రీవేషమును వేసిరి. సన్నగా దువ్వి యమర్పఁబడిన కేశపాశమున నలంకరింపఁబడిన మల్లెవిరులు రాత్రిమధ్యమునఁ దిలకించు నక్షత్రముల వలెఁ దేజరిల్లెను. నయనములఁ జిత్రింప బడిన కాటుక రేఖ నీటుగాఁ జెలువొందు చుండెను. కర్ణాదులయందు భూషితంబు లగు భూషణంబుల తళత్తళలు దిశలం బ్రాకు చుండెను. వలిపెంపుఁ జిలుగుబుటేదారుచీరె గట్టుటచే మొయిదీఁగె పుష్పించిన తీఁగెవలె నుండెను. వక్షస్థలం బున్నతంబై యింపు నింపు చుండెను. సామవంతుఁడు సామంతినియై రెండవ గౌరీదేవివలె నొప్పియుండెను. సుమే ధుఁడు భస్మరాగము నలందిన నెమ్మొగమ్ముతోఁ దేజరిల్లుచు రుద్రాక్షమాలికల శిరఃకంఠ కరతలంబులం బెట్టి వీపునఁ గృష్ణ మృగచర్మమును ధరించి యపరశివునివలెఁ గన్పట్టు చుండెను. ఇట్లు వారిరువురు దంపతీవేషము దాల్చి ముసిముసి నగవులు నగుచు సరసోక్తు లాడుచు నిషధ దేశంబున సీమంతిని కడకు జనిరి.

నాఁడు సోమవాసరము. సీమంతినీ వ్రతాలయము పవిత్రస్థలమై చూతపల్లవతోరణంబులచే విభూషితం బై కుసుమ మాలికల వాసనలచేతను, సాంబ్రాణి వాసనలచేతను నాసికామోదముఁ గావించుచుఁ జూచువారలకు నేత్రపర్వమై యొప్పెను. దేశదేశముల నుండి వచ్చిన జారాపతులు రత్నకంబళములు బఱచి యున్నతోచ్చాలాంగణమున నాసీను లైరి. సీమంతిని పవిత్రస్నానం బొనర్చి శుద్ధవసన ధారిణియై సువర్ణ ఖచిత పీఠమున నాసీనయై సిగ్మల చిత్రమున వ్రతమారకుఁ గడం గెను. పురోహితుఁడు దేవతాహ్వానముచేసి ప్రాణ ప్రతిష్ఠఁ గావించి విధ్యుక్తమంత్రంబులఁ జదువుచుండెను. సీమంతిని గౌరీయుక్తుఁడగు మహాదేవునకు నావాహనము, నాసనముఁ బాద్యము, నర్ఘ్యము, నాచమనీయము, నభిషేకము, యజ్ఞోపవీతము, వస్త్రము, గంధపుష్ప ధూపదీపనైవేద్యాది షోడశోపచారములం గావించి యారాధించి వ్రతాంతమున దంపతులకుఁ బూజలు గావింపఁ దొడఁగెను. అందు నానాదేశీయులగు జారాపతుల నర్చించి సువర్ణ మణి వస్త్రాదుల నపారముగా నొసంగుచుండెను. ఇంతలో నాకృత్రిమ దంపతు లాహ్వానింపఁబడి పీఠముల నాసీనులైరి. వారలఁ గనుగొని నంతనే యామహాదేవీ ముఖాబ్జంబునఁ జిఱునగ వంకురించెను.

వారు కల్పిత దంపతులని యామె మనంబునఁ దెలిసికొని యెను. మహాపతివ్రతల కెఱుఁగరానిదే మున్నదను ? ఆమె యాదంపతుల నేమియు ననుగ లేదు. వారలయందుఁ బార్వతీ పరమేశ్వరుల నావహింపఁజేసి స్త్రీపురుష భావనతో నర్చించి సంపూర్ణబహుమానంబు లొసంగెను. పెక్కురకును బూజలు గావించెను. అనంతరమున భక్ష్యభోజ్య పరిశోభితం బగు నరసాన్నం బిడెను. పిమ్మట నందఱును సంపూర్ణ మనో రథులై వారి వారి దేశముల కేగిరి. ఆకపటదంపతులును మహో న్నతలాభంబున కానందించుచుఁ దమయూరి కరుగుచుండిరి.

మార్గమధ్యమునఁ బుష్పఫలశోభితం బగు వనము గన్ప ట్టెను. అందుఁ బురుషుఁడు ముందరుగుచుండెను. సామ వంతుఁడు వెనుకఁ జిక్కి " నాథా, నన్నువిడిచి ముందేల యరిగెదవు? నిలువుము. సుఖముగా మన మీ వనంబున నిలుతము. రమణీయంబగు నీవిపినమున విహరింతము. మలయ మారుత మెంత హాయి నిచ్చుచున్నదో చూడుము ! " అని పలువిధంబుల సుమేధుని సకామవచనములఁ బిలుచు దమ నమీపించెను. సామవంతునకు యథార్థ మగు స్త్రీ ధర్మము ప్రాప్తించినది. లక్షణములు మాత్రమే కాదు. అతఁడు నిజ ముగా నాఁడుదియే యయ్యెను. స్త్రీచేష్టలుబుద్ధులు నన్నియుఁ బట్టుపడ్డవి సుమేధుఁడది యెఱుఁగక "మిత్రమా, సామవంతుఁడా! ఈప్రల్లదము లేల? ఇఁక చీరె విడిచి ధోవతిఁ గట్టుకొ నుము. వేషము వేసి ధన మార్జించితివిగదా. అపుడు నిన్నుఁ

జూచి నిజముగా నాఁడుదానవే యని భ్రమించితిని. సోమా సోమా యని బిలచుచు ముచ్చటఁ దీర్చుకొంటిని. ఇఁకఁ జాలును. నీ వేషము కట్టిపెట్టి రమ్ము." అని పలికెను.

సామ: ఔరా నీనెరజాణతనము! నన్నువిసర్జింప నెంచి కాఁబోలు ముందు పరుగెత్తుచున్నావు. నేను విడచుదానఁ గాను. నీవు మసిఁబూసి మారేడుకాయఁ జేయ నెంచు చున్నావు. నీకపటోపాయములు నాముందు చెల్లవు. పెండ్లి యాడిన వనితను విడువ నగునే? త్రావలేని పిల్లి బోరగిలఁ ద్రోసికొనెనన్నట్లు పండువంటి కాపురమునేల పాడుచేసెదవు రమ్ము సుఖముగా నుందము. అని పైకొనవచ్చిన వేలనైన యది యెఱుఁగక సుమేధుఁడు ఓయీ, నీకు మతిపోయెనా యేమి? విద్యావంతులకిట్లు పలుక నగునే? నిన్ను నీవు స్త్రీ ననుకొను చున్నావా? వెఱినీపిచ్చి. నీవు సామవంతుఁడవు కాదా? నీవిద్యాబుద్ధు లేమయ్యె? పలుభాష లేల? వాని నింకఁ గట్టిపెట్టి వదరక నావెంట రమ్ము. అదె పురము సమీపించినది. ఈద్రవ్యముతో మన పితరులను సంతసింపఁ జేయుదము."

అని తెలుపుచున్ననుఁ దానుబురుషుఁడను సంగతినిఁ గూడ మఱచి గద్దించుచు సామవంతుఁడు "ఔరా నన్ను మోసగించెదవే? నేను సామవతిని గాని సామవంతుఁడను గాను. నీసాహసోపాయంబుల నాయెదుటఁ బలుకకుము. స్త్రీ యన్న నబలక దా యని తిరస్కరింప నెంచితివి కాఁబోలు. నన్ను

సామవంతుఁడా యని పిలచెద వేమి? నే నెన్నఁడును బురుషుఁడఁ గాను. ఇటు చూడుము. ఇంక నిన్నుఁ గదలనిత్తునే?"

అని యాతనిఁ బోనీక నడ్డగించి మోహపరవశంబునఁ గనులఁ ద్రిప్పుచు నాతని భుజముల పైఁ జేతులు వైచుచుఁ జుబుకంబు దువ్వీన సుమేధుండు మేను బులకరింప మెల్లన నల్లముఁ జల్లపఱచుకొని, పాప మంతవఱకు నతఁడు స్త్రీయగు టెఱుఁగడు కావున నట్లు పలికి యపుడు నిజమెఱిఁగి ఔరా యెంత మోస మయ్యె! ఇఁక నీయువతి నన్నుఁ బోనీయదు. ఏమిసేయువాఁడ! రాజు మమ్మెంత మోసగించెను. సీమంతినీప్రభావ మెంతయొప్పెను! ధనాశ మమ్మెంతకుఁ దెచ్చెను! "అతివినయం ధూర్తలక్షణ" మ్మన్నట్లు చేతివైకుంఠము చూపుచు నాతఁ డెట్టినయగారపుమాటలఁ జెప్పెను! అతని నన్నపాపమేమి? మేము ధనమున కతనికడకేల పోవలయును! పోతిమిపో యిట్లేల యుపదేశింప వలయును! ఉపదేశించెబో మే మాపద్ధతి నేల యవలంబింప వలయును. అవలంబించితిమిపో యాసీమంతిని యెఱిఁగి మమ్మిట్లేల నేయ వలయును! ఆమె యిట్లు చేసె ననసేల మే మిట్లేలచేయవలయు! "బుద్ధిః కర్మానుసారిణీ" యనునట్లు మాకిట్టి మోగ ముండుటం గాఁబోలు నట్టిబుద్ధి పుట్టినది. ఇప్పుడేమి సేయువాఁడ, ఈమె విడువక పైఁ బడవచ్చుచున్నది. ఎట్లు తప్పించుకొనువాఁడ! ఎంతమూఁడినది. " , నాచదు వేల అప్పుడు మాబుద్ధి పెడతలఁ బట్టినది. దైవము ప్రతి

కూల మైనది. ఇప్పుడు తప్పించుకొని యెక్కడికైనఁ బోవుద మన్నను నీ మెనా వెంటనుండి విడువకున్నది. ఈరహస్య మీమామతండ్రికిఁ దెలుపక దాపుకునా! యెట్లు దాపనగును? నోరు మూయ మూఁకుడు లేదుగదా! కావున దీని దాపక వెల్లడిచేయుటయే యుక్తము. పిదప నేమైన నగుఁగాక! అని పరుగులువాఱుచు సారస్వతునితో విదర్భేశ్వరునిమూలమున నింతయయ్యెనని రహస్యంబంతయు నామూలాగ్రంబుగా నుడివెను. అతఁడు వేదమిత్రునకుఁ దెలిపెను. వారిరువురును జప్పించి విదర్భేశ్వరునడుగుద మనిబిడ్డలతోఁగూడ రాజుకడ కరిగి సంగతిని దెలిపిన విదర్భేశ్వరుఁ డేమియుఁ జేయునది లేక మోము వెలవెలఁ బాఱ మిన్నకుండెను. అప్పుడు సారస్వతుఁడు కోపోద్దీపితుఁడై రాజుతో నిట్లనియెను:—

"రాజా! తనరాజ్యమున దుష్ప్రవర్తను లున్నచో వారిని దగురీతుల శిక్షించి సన్మార్గగాములఁ జేయుట రాజుల ఋణము. నీవట్లు చేయక దుర్మార్గగామివై యనపరాధియగు నాబిడ్డ నిట్లు చేసితివి. నిన్నిప్పు డేమనవలయు నేను ధన మొసఁగ నెందైనఁ బోవు దని నుడువరాదా? జగంబున నీకంటె దాతలు లేరా? ఇట్టిపనికు రాజత్వ మేల? నీచ బోధనచే లోకుల నిట్లధోగతులపాలు చేసెదవే? నీమూల మున నెంతమూఁడెనో చూచుము. ఇపు డేమిసేయఁగలవు. నీవంటిదుష్టరాజు నాశ్రయించుటకంటెఁ బశువు నాశ్రయిం చుట మేలు. సీమంతినీమహాప్రభావ మెఱుఁగక నోరులేని

మాబిడ్డల నిట్లక్కడికిఁ బంపఁ దగ దనుట యెఱుఁగని నీవు రాజ్యపాలన మెట్లు చేయఁగలవు? ఇంకొక మాట చెప్పెదను. నాకు వీఁడొకఁడే పుత్రుఁడు. నాకా యేండ్లు చెల్లినవి. నాకు మఱల నాపుత్రు నిచ్చెదవా సరి. ఈయనిచో నీవంశము నశించునట్లు శపింతును అట్లు కానిచో నీవాకిటిముందరనే యురిపెట్టుకొనియైనఁ బ్రాణములఁ దీసికొందును. ఏమి చెప్పెదవు? చెప్పవేమి?"

ఇట్లా బ్రాహ్మణుఁడు కోలాహలము చేయసాగెను.

## ౧౪

విదర్భేశ్వరుఁడా మాటలకేమియు బదులు సెప్పఁజాలక గ్రుడ్లు మిటకరించెను, శపించు నని భయమునొందెను, గడగడ వడఁకెను. వానికి నోట తడిలేదు. మేను చెమర్చెను. తన్ను నిందించుకొనెను. పరితపించెను. ఏమియుఁ జెప్పలేక నిర్విణ్ణ మనస్కుఁడై నిలువఁబడెను. అప్పు డతనిగురు వగు భరద్వాజుఁ డది చూచి యాపత్కాలమున రాజును గాపాడుట ధర్మ మని తలఁచి యిట్లనెను: "రాజేంద్రా, విచారపడకుము. నీవు యోగ్యుఁడవు గాని దుష్టుఁడవు గావు. అయినను ప్రారబ్ధవశమున నీకప్పు డట్టిబుద్ధి యుదయించి యింతకు దెచ్చెను. నీవు దేవీభక్తుఁడవు. ఇప్పు డంబికాభజనము

కేగి పరదేవినిఁ బ్రార్థింపుము. నేనునామంత్రబలముచే దేవతను నీకుఁ బ్రత్యక్ష మగునట్లు చేసెదను. నీవు దేవిని వరంబు వేడుకొనుము. నీయుపఖ్యాతి తొలఁగఁ గలదు." అని బోధింప విదగ్ధేశ్వరుఁడు తద్వ్యాఖ్యానసారముగా నంబికాలయంబునకేగి త్రిరాత్రదీక్షఁబూని భక్తియుక్తుఁడై ప్రార్థింప నా దేవి ప్రసన్నవదనయై ప్రత్యక్ష మయ్యెను. నృపతియు దేవిని స్తుతించి సామవంతుని మఱలఁ బురుషునిగాఁ జేయు నట్లు వరము వేడ నద్దేవి యిట్లనియె:—

"రాజా! కోకిలలకు స్వరము, రూపహీనులకువిద్య, తపస్వులకు శాంతము, స్త్రీలకుఁ బాతివ్రత్యము, భూషణము. గోవులు, విప్రులు, వేదములు పతివ్రతలు, సత్యవంతులు, దానశీలురు, పరద్రవ్యానపేక్షులు, నుండునంతవఱకు భూమండలము నిలిచి యుండును. సాధ్వీమణులప్రభావము వివరింప విరించికైన నలవి కాదు. మున్నొకపురంధ్రీమణి సూర్యుడుదయింపకుండు నట్లానఁబెట్టెను, మఱియొకసతీతిలకము త్రిమూర్తులపత్నులకుఁ గూడ నలవి గాని యినుపగుండ్ల నాహారముగాఁ జేసి పెట్టెను. ఇట్టి సాధ్వీమణులశాసనము నెవ్వారికిం గూడఁ ద్రిప్ప నలవి కాదు. వారిసంకల్పంబమోఘంబు. సుచరిత్రలకు వ్యతిరేకము సేయ నెంచచో నెట్టిదేవతలకైనను ముప్పు వాటిల్లును. మున్ను తనభర్తకపకార మొనర్చుటచే నాపతివ్రతకుఁ గోపము వాటిల్లుటం జేసి నృసింహరూపుఁ డగు మహావిష్ణు వజ్ఞానియై మాయకు

లోనైన మనుష్యుఁడై జన్మించెను. ఇంతియకాక బహుజన్మం బులఁ జేసిన పుణ్యమునం గాని దేహి కీశ్వరభక్తి గలుగనేరదు. దృఢభక్తివలనఁ గాని దేవతలు ప్రసన్నులు గారు. మహా భక్తుల కీశ్వరానుగ్రహం బన్నఁ గరతలామలకంబు. అట్టి యనుగ్రహంబున వారికి సాధ్యంబు గానిది లేదు. భక్తు లొనర్చిన కార్యముల కెట్టిదైవములైనను భిన్నముఁ జేయఁ జాలరు. దేవతలు భక్తులచేతిలోని కీలుబొమ్మలు. కావునఁ బతివ్రతా శిరోరత్నమై సకలసద్గుణనిధానమై నా భక్తురాం డ్రలోనెల్ల నగ్రగణ్యయై పరమేశ్వరుని ప్రేమరూపయైన సీమం తిని చేసిన సంకల్పమునకు నేను ప్రతిక్రియఁ జేయ నేరను. ఈవనితయే మఱలఁ బురుషరూపములో నుండవలయు నను నిచ్చ యుండెనేని సీమంతినినే ప్రార్థింపుఁడు. అట్లు కాకచో నీ యిరువురిని దంపతులుగానే యుండ నిండు. పుత్త్ర కాంక్షతోనున్న యీభూసురోత్తమునకు మఱియొక పుత్త్రుఁడు జన్మించునట్లు వర మొసంగెద." అని కరుణించిన వార లాసారస్వతుని నీయభీష్టం బెద్ది యని యడుగ నా ద్విజుఁడు దౌహిత్రాది లాభంబు కలుగుగదా యని యామె పుత్త్రిక గానే యుండునట్లును, వంశోన్నతి హేతుభూతుఁ డగు తన యుఁడు కలుగుగదా యని మఱియొక నందనుఁడే కావలయు ననియుఁ గోరెను. అంబికయు నట్లే వర మొసఁగితి నని సెల విచ్చెను. అందఱును సారస్వతునియుక్తికి సంతసించిరి. అం తట మహాదేవి యంతర్థాన మయ్యెను. సామవతీసుమేధులకుఁ

బరిణయముఁ గావించిరి. విశ్వేశ్వరుని యపఖ్యాతి తొలఁగెను. అందఱు నానంద భరితులైరి.

అచ్చట సీమంతినీమణి యగు సీమంతిని నిరంతరాయముగా గౌరీశివార్చనము సలుపుచు భర్తృసదనంబున నానంద కళికయై ప్రజలపాలిటి కల్పలతయై కీర్తిశాలిని యను చక్కని ముద్దుబాలికం గని పరమ సుఖాంబుధి నోలలాడు చుండెను. మహనీయుల చరిత్రములు వర్ణింప నలవి కాక యుండునుగదా!

భువనశ్రేణి వహించు శేషుఁడు ఫణాభోగంబుపై సంతతం
బవలీల న్భరియించుఁ బ్రాప్తమునఁ గూర్మాధీశ్వరుం డాతనిన్
ధవళక్రోడవశాత్ముఁ జేయు నతనిన్ వారాశియుఁ గ్రాంతిచే
నవురా, ధీరచరిత్రసంపదల సంఖ్యాతప్రభావోన్నతుల్ !

శ్రీ వేదవ్యాస మహర్షి శిష్యుఁడు, నిఖిలపురాణ రహస్యజ్ఞుఁడు నగు సూతుఁడు కీర్తిమాలినీ పూర్వజన్మవృత్తాంతమును, దద నంతరకథావృత్తాంతమును, మఱల శౌనకాదుల కిట్లు చెప్పఁ దొడఁగెను. మహర్షులారా! సర్వపాపహరంబు, స్వర్గాప వర్గకారణంబుఁ బరమపవిత్రంబు నగు నీకథను సావధాన మనంబున నాకర్ణింపుఁడు.

మహాస్నవంతీదేశమున మందరుఁ డను బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు నామమాత్రముచే బ్రాహ్మణుఁడే కాని వాని యందు వాస్తవ మగు ద్విజలక్షణంబులు లేవు. స్నాన సంధ్యాదు లడుగంటినవి. వానికడ సదాచార మన్ననో కలికాసికైనఁ గాన రాదు. యజ్ఞోపవీత ధారణమన్న వీపు దురదను బోఁగొట్టుకొనుటకని వాని యభిప్రాయము. అతఁడు రాత్రి రెండు జాముల వఱకును స్త్రీ ద్యూత పానాదులతోఁ గాలము గడపుచుఁ బగలు జాము ప్రొద్దెక్కినప్పటికి నిదుర లేచి దంతధావనము సేయ నారంభించును. పెద్దలు తన ప్రవర్తనమును నిందింతు రను సందియ మాతని డెందమున లేదు. అకాల సంధ్యావందనమును, సకాల సంధ్యావందనమును విడిచి రాక్షసులనోటను, దేవతలనోటను గడ్డఁ గొట్టె నను లోకోక్తి యాతనియందే సార్థక మగుచున్నది. అసత్యమున కతఁడు-

వెనుదీయఁడు. దుష్కార్యములకు ముందంజ వేయువాఁడతఁడే. పాపమువలన నరకము, బుణ్యమువలన స్వర్గమును గలుగు నని యాతఁ డెఱుఁగు నేమో కాని ప్రవర్తనమునందు మాత్రము రెండవ పక్షము నవలంబించుట కానిపించదు. ఆతనికి సర్వసమత్వజ్ఞానము విజాతీయ భోజనమునందు మాత్రము కలదు. స్వకులాచరవర్తనమన్న దేవతార్చన మన్న, దేవుఁడే యెఱుఁగును. దుశ్చరిత గ్రంథ పఠనమన్న నాతనికి వేదపఠనమే. జూదరులుఁ ద్రాగుఁబోతులును వానికి రాజ బంధువులు. గంధమాల్య దివ్యాంబర ధారణమే వానికి భస్మతిలక రుద్రాక్షాది ధారణముగా నుండును. అకారణ వైరము, నిర్దాక్షిణ్యము మున్నగునవి వానికిసహజగుణములు. పరద్రవ్యాపహరణ మన్న వాని కమృతాపోశనము.

కారణము లేనికలహంబు గరుణలేమి,
పరవధూపరధనకాంక్ష బంధుసాధు,
జనములం దసహిష్ణుత్వ మనఁగ జగతి
బ్రకృతిసిద్ధంబు లివి దుష్టనికరమునకు.

ఏతాదృశ లక్షణయుక్తుఁ డగువానికి వర్ణాశ్రమాచార లక్షణంబు లన్నియుఁ దక్కువ యైనను మున్నజామిళునియందుఁ గల లక్షణములలో నొక్కటియుఁ దక్కువ గాకుండెను.

ఆ మందరునకు పింగళ యనువేశ్య కలదు. అతలోదరి స్వకులోచిత మగు వేశ్యావృత్తితో నున్న మందరునికంటె నుత్తమురాలై కమలము నందలి మకరందమును దుమ్మెదవలె

మందరునిధన మంతయు మెల్లగా నుపాయముచే నాకర్షించు చుండెను. అది యామందరునిపాలికి రత్నఖని. మందరుఁ డెంతవానికి లొంగకుండెను గాని యాయువతికిఁ జెప్పు క్రింది తేలు. దాని నామస్మరణమే వానికి హరినామస్మరణము. ఆసుందరిగృహకృత్యములు నిర్వర్తించుటయే వానికిఁ బంచ మహాయజ్ఞములు. ఆ చిలుకలకొలికి శుశ్రూషయే వానికి బ్రహ్మయజ్ఞము. ఆ హంసగామిని పాదాభివందనమే సంధ్యావందనము. ఆ యింతిప్రణయతర్కమే వానికి శాస్త్ర తర్కము. ఆపింగళ తనమాయా నైపుణ్యముచే వానిని యంత్రపుబొమ్మను జేసెను. మందరుఁ డిట్లు మోహపాశ బద్ధుఁడై యాకలువకంటియింటనే కాఁపురము సేయుచుఁ గాలముఁ గడుపుచుండెను. వారిరువురు నానందాంబుధి నోలలాడుచుండిరి.

ఒక్కయెడ ఋషభయోగీంద్రుఁ డనుమహాత్ముఁడు దైవ వశమున నాపింగళామందరు లున్నమందిరమునకరుదెంచెను. ఆ తేజోరాశి దీర్ఘజటలుఁ గావివస్త్రములును గలిగి యాజానుబాహుఁడై విలసిల్లుచుండెను. ఆయోగీంద్రుఁడు బ్రహ్మనిష్ఠగరిష్ఠుఁడు. ఆసర్వసమునకు సర్వమహిమలును కరతలామలకములు "నిస్త్రైగుణ్యే పథి విచరతాం కోవిధిః కోనిషేధః" అనునట్లు విధినిషేధములకు సజాతి యని విజాతి యని భేదముండదు. అట్టివా రాత్మారాములు. వా రెందు యినను స్వేచ్ఛగాఁ బ్రవర్తించు చుందురు.

కౌపీనంబును జీర్ణకంథయు నపేక్షాశూన్య భైక్షంబుఁ జిం
తాపాయంబును నగ్నశాయనములనిద్రావ్యాప్తి దుర్వారస
ద్వ్యాపారంబుఁ బ్రశాంతచిత్తమును యోగారూఢియుక్ వృత్తిసం
క్షేపంబుం గలదేని యోగికిఁ ద్రిలోకీప్రాభవం బేటికిన్.

అమ్మహాత్ముం డరుదేరఁ దకు మున్నెన్నఁడు నతిథి పూజ సలిపి యెఱుఁగనిపింగళామందరులకుఁ బూర్వజన్మ సుకృతంబునఁ గాఁబోలు యోగియెడ భక్తి యుదయించినది. అమ్మౌని పరమేశ్వరుఁడని వారికి బుద్ధి వొడమినది. భక్తి యుప్పతిల్లినది. ఔరా మహాత్ముల యనుగ్రహ మెట్టిపాపుల కైనను జ్ఞానమును గలిగించుఁగదా! అంత నావేశ్యాద్విజు లయ్యోగి కెదురేఁగి సాష్టాంగనమస్కారములు గావించి సవినయముగాఁ దోడ్తెచ్చి గద్దెకంబళముల నలంకరించిన పీఠముపైఁ గూర్చుండఁబెట్టి సేవించిరి. మార్గాయాసము తీరునట్లు తాళ వృంతములం గొని విసరిరి. చల్లని స్వాదుజలంబులచే నామహా మహుని చరణములం గడిగిరి. విష్ణుపాదమునఁ బొడమిన గంగను శివుఁడువోలె దజ్జలంబుల శిరంబున నిడుకొనిరి. స్వాగతం బడిగి గంధపుష్పాక్షతాదులం బూజించి నమస్కారంబు లర్పించిరి. అంత మధురాన్నరసంబుల విందారగింపఁజేసి శుభపీఠంబున నాసీనుం జేసి కోమలంబు లగునాదవల్లీదళంబుల సుగంధ ద్రవ్యసమేతంబుగాఁ దాంబూలం బొసంగిరి. పాదసేవనాదిసర్వోపచారంబులఁ గావించిరి. ఇట్లు వారిచే నయ్యోగీంద్రుడు పూజింపఁబడి యొక రాత్రం బందుండి

మఱునాటి వేకువనే లేచి నిజేచ్ఛఁ జనియెను. ఇట్లయ్యిరువురును పమజన్మమధ్యంబున నాఘనకార్యంబు నొక్కదానిని మాత్రముఁ గావించి తక్కినకాలమును దుష్కృత్యములతోఁ గడపుచుఁ గొంతకాలమునకుఁ గాలధర్మ మొందిరి.

## ౧౬

దశార్ణదేశము నేలు వజ్రబాహుమహారాజునకుఁ బలువురు భార్యలు కలరు. వారిలో నగ్రభార్య సుమతి యనుపేరఁ బరఁగు చుండును. ఆసాధ్వి మిగులనుత్తమురాలు. ఎందఱు భార్య లుండినను వజ్రబాహునకు సంతతి లేదు. కొంత కాలమునకు దైవానుగ్రహమున సుమతి గర్భవతి యయ్యెను. తక్కినభార్యలకు సంతతి లేక సుమతి గర్భిణి యగుటంబట్టి వారోర్వఁజాలక యామెకు మాయోపాయముచే విషముఁ బెట్టిరి. ఎంతకైన నంతకు లుందురుగదా! ఆగరళప్రయోగ, మామెయాయువు గట్టి దగుటంబట్టి, ప్రాణములఁ దీయఁ జాలక మహావ్యథగావింపఁ దొడఁగెను. మహారణ్యమున నున్నను, రణంబునఁ గూలినను, శత్రుజనవహ్నిమధ్యంబులఁ జిక్కినను, సంద్రమున మునిఁగినను, పర్వతశిఖరములనుండి దొఱలినను, నిద్రించినను, బ్రమత్తుఁ డైనను, మహాదుర్దశ ననుభవించు

చున్నను దేహింబు బురాకృతసుకృతములు జీవింపఁ జేయునుగదా!

సుమతి సజీవ యయ్యును బ్రయోజన మేమి? మరణవేదన కంటె నెక్కుడగు యాతనల నొందుచుఁ గొంతకాలమున కొక మగశిశువుం గనెను. పాపము. వివదోష మా తల్లికి మాత్రమే కాదు; పసివానికిఁగూడ సంక్రమించినది. బాలు నావేదనపాలు చేసినది అది నానాఁటికి శుష్కవిపినమున నగ్ని వలె నతిశయించు చుండెను; గాని లేశ మైనను దగ్గ లేదు. వజ్రబాహుఁడు భార్యాపుత్రాపేక్షచే నెన్ని యోచికిత్సలు చేయించెను. గాని గుణహీనునకు జేసిన యుపకారములవలె నవి యన్నియు నిష్ఫలము లగు చుండెను. మాతృబాధకంటెఁ బుత్రబాధ, పుత్రబాధకంటె మాతృ బాధ, యెక్కుడుగాఁ దోఁచు చుండెను.

ఆపుత్రుఁ డెవ్వఁడో కాదు, వెనుకఁజెప్పఁబడినమందరుఁడే. పిమ్మటి జన్మమున నీబాలుఁడై పుట్టెను. తొల్లి సలిపిన మహాపాతకములు వానినట్లు రోగపీడితు నొనర్చెను. చేసిన దాని ననుభవింపక తప్పించుకొన శక్యమే!

తొలుత పుట్టువు పాపంబువలన జనము
లంగహీనులుఁ గుష్ఠజాడ్యాభిహతులుఁ
గనులు పోయినవారలుఁ గాళ్ళు లేని
వారలు దరిద్రు లౌదురు వసుధయందు.

ఎట్టివారికైనను బ్రారబ్ధ మనుభవింపక తప్పదు. ప్రాణికి శుభాశుభములకుఁ గర్మమే కారణ మగు చుండును. కర్మమునకు వశుఁడు గానివాఁ డొక్కరుఁడును లేఁడు.

కర్మమునఁ బుట్టు జంతువు
కర్మమున సమృద్ధిఁ జెందుఁ గర్మమునఁ జెడుం
గర్మమె జనులకు దేవత
కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా!

హరిశ్చంద్ర నలాదిపుణ్యపురుషులును గష్టముల పాలగుట దుష్కృతముల వలన నే.

ఇట్లమ్మాతాసుతులు ఘోరాతిఘోరము లగు క్లేశముల నందుచు గరళసంసర్గవశమున దివానిశంబులు విలపించు చుండిరి. కుఱ్ఱవానికిఁ బదిసంవత్సరములయీడు వచ్చినది. బాలుఁడు తిన్నగా నడువ నేరఁడు. నుడువరాని యామయముం బుచేఁ జిన్నవాని సుందరాంగం బంతయు వ్రణమయం బయ్యెను. వజ్రబాహుఁ డెన్నెన్ని విధముల నెందరెందరి వలన నేమేమిచికిత్సలు చేయించిన నవి యన్నియుఁ బూడిదెలోని యాహుతు లగు చుండెను. పాప మా రాజేమి చేయఁ గలఁడు! బాలుఁ డెట్లోర్వఁగలఁడు? నవ్వుచుఁ జేసి యేడ్చుచు ననుభవించు ననుసామెతచొప్పునఁ బాపకృత్యము బాలు నెంతకుఁ దెచ్చెను? వారి దివానిశ ప్రలాపములచే రాజునకు నిదురయే లేదు. వా రిరువురును జచ్చిన బాగుగా నుండుఁగదా యని విసుఁగు కలిగినది. అంత నొక్కనాఁడు వజ్రబాహుఁ

చున్నను దేహిం బురాకృతసుకృతములు జీవింపఁ జేయునుగదా!

సుమతి సజీవ యయ్యును బ్రయోజన మేమి? మరణవేదన కంటె నెక్కుడగు యాతనల నొందుచుఁ గొంతకాలమున కామె మగశిశువుం గనెను. పాపము. విషదోష మా తల్లికి మాత్రమే కాదు; పసివానికిఁగూడ సంక్రమించినది. బాలు నావేదనపాలు చేసినది అది నానాఁటికి శుష్కవిపినమున నగ్ని వలె నతిశయించు చుండెను; గాని లేశమైనను దగ్గ లేదు. వజ్రబాహుఁడు భార్యాపుత్రాపేక్షచే నెన్ని యోచికిత్సలు చేయుంచెను. గాని గుణహీనునకు జేసిన యుపకారములవలె నవి యన్నియు నిష్ఫలము లగు చుండెను. మాతృబాధకంటెఁ బుత్రబాధ, పుత్రబాధకంటె మాతృబాధ, యెక్కుడుగాఁ దోఁచు చుండెను.

ఆపుత్రుఁ డెవ్వఁడో కాదు, వెనుకఁజెప్పఁబడినమందరుఁడే. ఇప్పటి జన్మమున నీబాలుఁడై పుట్టెను. తొల్లి సలిపిన మహాపాతకములు వానినట్లు రోగపీడితు నొనర్చెను. చేసిన దాని ననుభవింపక తప్పించుకొన శక్యమే!

తొలుత పుట్టువు పాపంబువలన జనము
లంగహీనులుఁ గుష్ఠజాడ్యాళిహతులుఁ
గనులు పోయినవారలుఁ గాళ్ళు లేని
వారలు దరిద్రు లౌదురు వసుధయందు.

ఎట్టివారికైనను బ్రారబ్ధ మనుభవింపక తప్పదు. ప్రాణికి శుభాశుభములకుఁ గర్మమే కారణ మగు చుండును. కర్మమునకు వశుఁడు గానివాఁ డొక్కరుఁడును లేఁడు.

కర్మమునఁ బుట్టు జంతువు
కర్మమున సమృద్ధిఁ జెందుఁ గర్మమునఁ జెడుం
గర్మమె జనులకు దేవత
కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా!

హరిశ్చంద్ర నలాదిపుణ్యపురుషులును గష్టముల పాలగుట దుష్కృతముల వలననే.

ఇట్లు మాతాసుతులు ఘోరాతిఘోరము లగు క్లేశముల నందుచు గరళసంసర్గవశమున దివానిశంబులు విలపించుచుండిరి. కుఱ్ఱవానికిఁ బదిసంవత్సరములయీడు వచ్చినది. బాలుఁడు చిన్నగా నడువ నేరఁడు. నడువరాని యామయం బుచేఁ జిన్నవానియుదరాంగం బంతయు వ్రణమయం బయ్యెను. వజ్రబాహుఁ డెన్నెన్ని విధముల నెందరెందరి వలన నేమేమిచికిత్సలు చేయించిన నవి యన్నియుఁ బూడిదెలోని యాహుతు లగు చుండెను. పాప మా రాజేమి చేయఁగలఁడు! బాలుఁ డెట్లోర్వఁగలఁడు? నవ్వుచుఁ జేసి యేడ్చుచు ననుభవించు ననుసామెతచొప్పునఁ బాపకృత్యము బాలు నెంతకుఁ దెచ్చెను? వారి దివానిశ ప్రలాపములచే రాజునకు నిదురయే లేదు. వా రిరువురును జచ్చిన బాగుగా నుండుఁగదా యని విసుగు కలిగినది. అంత నొక్కనాఁడు వజ్రబాహుఁ

డాశ్రమములఁ జూడఁజాలక వారిని మృతప్రాయులనుగా నెంచి దోడ్కొనిపోయి యరణ్యమధ్యమున విడిచి రమ్మని యొక సేవకునకుఁ గట్టడ చేసెను. వాఁడు రాజాజ్ఞచొప్పున నడవ వలసినవాఁడు గాన నేదో యొకమిష గల్పించి యామాతా పుత్రుల నొక రాత్రివేళఁ గొంపోయి భయంకరారణ్యమున విడిచి వచ్చెను. అట్టిరోగుల కంతపని జేయింప రాజునకు మన సెట్లొప్పెనో ఆ మహారణ్యము వ్యాఘ్ర భల్లూకాది ఘోరమృగంబుల కాటపట్టై కంటకపన్న గాద నంకులంబై బెగడుగొల్పు చుండును. అందు సుమతి దిక్కు లేక, దారిఁ గానక ఘోరమృగారవంబులకు చెదరుచు, వృక్షమర్మర ధ్వనులకులుకుచు, చీమ చిటుక్కు మన్నంత నదరి పడుచు, రోగబాధచే గుందుచు నాకలిదప్పుల వలన క్షోభపడుచు, బాలు నెత్తుకొని నడువఁజాలక విసుఁగుచు, హా దైవమా! యిట్టినన్నుఁ జంపికొని పోవరాదా యని దూరుచుఁ బలుశ్రమ లొందు చుండెను. ఎంతదురపిల్లిన నామె రోదన మరణ్యరోదనమే కదా! కట్టఁ డాహారము లేమిం జేసి పెల్లురోదన మొనర్ప వాని శుష్కకంఠముఁ వడపుట్టై సుమతి యొండెందో తిరిగి సలిలముచేఁ బ్రాణముల నిలిపి నిమిషము మహాయుగముగాఁ గడపుచు నొక గ్రామంబున కేగుమార్గము నూచి వసులం దోలుకొని పోవు గోపాలుర సాహాయ్యముచే

నొక కోమటిపల్లెకుం జేరెను. దిక్కులేని వారికి దేవుఁడే తోడగుచుండుఁగదా !

ఆపల్లె యంతపెద్దది కాకున్నను జనసంకలితమై రమ్యముగా నుండును. అందందఱికంటెను వైశ్యజనము లధికముగా నివసింతురు! వారిలో పద్మాకరుఁ డనువైశ్యుఁ డధికధనవంతుఁడు. ఆయార్యవైశ్యుఁ డతిధర్మాత్ముఁడు, విశేషముగా నీశ్వరారాధన మొనర్చువాఁడు. అతఁడు గొప్పపుణ్యకార్యములు సలుపుచు నప్పటికి వచ్చుచుఁ బోవుచుండు వారియోగక్షేమము లారసి వారలకుఁ దగువసతు లొనర్చి వస్తుసాధనములచే సహాయము చేయుచుండుటయే కాక దీనసాధుల యార్తనాదము విన్నంతనే జాలిపడి యెట్టిసహాయమైనను జేయుచుండును. దేవలోకమునుండి వచ్చిన వారిజన్మము లిట్టివిగానే యుండును.

ఆపదఁ దూలిపోక, సిరి నంది మదింపక, ధైర్యవృత్తిపైఁ
బాపులఁ గెల్చి, యార్జవము బంధుజనాళికి నార్యకోటికిం
జూపుచుఁ దీనులం గరుణఁ జూచి తగం గలమాత్రఁ బ్రోచుచుం,
గోపము లేనిమన్కి గలుగున్ దివిజాంశమునన్ జనించినన్

ఆపద్మాకరుని గృహదాసి యొక్కతె నాఁడు కార్యవశమున వీధివెంటఁ బోవుచు సుతునితో శ్రమపడుచు నవసి యున్న సుమతిం గాంచి జాలివొడమి 'అమ్మా మీ దే గ్రామము ? ఎందరిగెదవు ? ఇట్టిపుత్రకునితో బాధ నొందు నీకు రక్షకు లెవరును లేరా?' యని మందలించి తచ్చరిత్ర మం

తెయు నామెవలనఁ దెలిసికొని యాసంగతి తత్క్షణంబ పద్మా
కరున కెఱింగించెను. ఆవైశ్యశిఖామణి దయాపరుఁడు కావున
సుమతిని రావించి యామెదుర్దశను విచారించి జాలిపడి తన
నివాస భవనమున కెదుట నుండుకొట్టమున నామె నుంచి
యాదరించి భయ మందకుమని ధైర్యము సెప్పి వలయు
భోజనాదులకెల్ల సౌకర్యంబు గావించుచుఁ గంటికి ఱెప్పవోలెఁ
గాచు చుండెను. మఱియుఁ దద్వ్యాధి నివారణమునకై
యెంతయోపాటుపడియెను గాని యది యంతయు యథా
పూర్వం బయ్యె. సుమతి బాధాపీడిత యయ్యు నాపుణ్యా
త్ముని సముచితాదరణ వశంబునఁ గొంతదుఃఖము వాసి
యుండెను. ఇట్లు కొన్నిమాసములు గడచినవి. ఒకనాఁడు
సాయంకాలమైనది. వారి దురవస్థకు విలపించు చున్నవో
యన ఖగనికాయంబులు వృక్షంబులపైఁ జేరి యరవఁజొచ్చెను.
ఆమె సంతోష మిక్లే యడుగంటు నని తెలుపుటకో
యన సంధ్యారాగ మంతకంతకు క్షీణించెను. సుమతి కింక
లోకంబు మునిఁగినట్లుండునని తెలుపు చుండెనా యన
జగ మంధకారమున మునింగెను. రాత్రి కొంత గడచినది.
అపు డాసుమతి బాలకుఁడు కిలకిలనేడ్చుచుఁ గనులఁ జేలగిల
వైచి నిశ్చేష్టితుఁ డయ్యెను. కాలుసేతులు చల్లగిల్లెను.
ఇఁక నేమియున్నది. ప్రాణములు పోయినట్లే కనిపించెను.
అనాథయగు నాసుమతి పుత్రుఁడు గతించె నని యేడ్చుచు
నురంబును శిరంబును మోఁదుకొనుచుఁ గంటినీరు వరదలై

పాటి "హాపుత్రా! నీతో నెన్నెన్ని శ్రమలనొందుచున్న నన్ను విడిచిపోతివే! ఇఁక నేనేమిసేయుదు! భర్తచేవిడువబడిన నను నీవు పెద్దవాఁడవై నాకష్టము తొలఁగింతువని యెంచుచున్న నాకోర్కె యడుగంటెనా? అయ్యో కొడుకా! నిన్నెట్లైన నారోగ్యవంతునిఁ జేయుదునుగదా యని పలుకడగండ్లు పడుచు నీకై నేను చేయు కృత్యములకు నేఁటితో ఋణము తీరెనా! కటకటా యోర్వఁజాలక నాసవతులు పెట్టినవిషము నన్నుఁ జంపలేక నీప్రాణముల నెత్తుకొని పోయెనా? అక్కటా! నీమరణవార్త నీసవతితల్లులకు సంతోషవార్తయయ్యెనా! నీతండ్రి మనల దూరముగా వెడలఁజేసినను నేనాఁటికైన నీతో నరిగి మరల భర్తను గాంచి గౌరవ మొందుదుఁ గదా యను నాయూహ నేఁటితో నీటఁ గలసెనా! నను గన్నతండ్రి జనకునివలె మనలను గాచుచున్న పద్మాకరుఁడు నీదురవస్థను జూడఁజాలక దురపిల్లుచున్నాఁడు. కన్నతల్లి యైనఁ జూడ వలదా! నీవలెనే రోగముచేఁ బీడింపఁబడుచున్న నన్నుఁ గొంపోక నిన్నింతకుఁ దెచ్చిన దైవము కంటికిఁ బేలగింజ పెద్ద దయ్యెఁగాఁబోలు. తండ్రీ నాకేమిదిక్కు? ఎన్నటికైన నిలుసేరి నీజనకునిసింహాసన మధిష్ఠించి ప్రజల నేలుచు క్రతుశతంబులచే దేవతలను దృప్తినొందించు భాగ్యము నీకు లేకపోయెనా! అయ్యో కుమారా! నీకు నేఁటితో నూరేండ్లునిండి యాయువు సమాప్తమయ్యెనా! అయ్యయ్యో నే నెంతమందభాగ్యురాలను. ఎంత పాప మొనర్చితి. హాదైవమా!" యని

పొరలిపొరలి యేడ్చుచుఁ బుడమిపైఁ బడి మూర్ఛిల్లి లబ్ధసంజ్ఞయై మరల నేడ్వఁదొడఁగెఁ. పద్మాకరుఁడు, నిరుగుపొరుగువారలును జాలినొందుచు చూచుచుండిరి. కాని, పాపము వారేమిసేయఁగలరు?

౧౭

ఆహా! దైవవిధానము విచిత్రము. దైవము దేని నెట్లొనర్చునో యెవ్వరు నెరుఁగఁ జాలరు. ఒక్కొక్కయెడఁ గీడులో మేలు సంభవించును. మన మెన్నఁడును దలంపనిదానిఁ గూడ దైవము సంఘటింపఁ జేయును.

సిద్ధిగానిపనులు సిద్ధింపఁ జేయును
సిద్ధమైనపనులఁ జెఱచుచుండు
జనుఁడు తలఁచకుండుపనులను
దైవంబు ఘటితమైనవాని గా నొనర్చు.

కెంజడలు చూతపల్లవములమాడ్కిఁ దేజరిల్లుచున్నవి. ఆమహామహుని యున్నతాకార మతని యత్యద్భుతశక్తిని వెల్లడించుచున్నది, హస్తమునఁ జెలువొందు యోగదండ మాతపోనిధి మహాయోగియని చాటుచున్నది. అరుణరుచులఁ జిలుకుచుఁ గంఠాదిపాదపర్యంతము వ్రేలుచున్న కావిరంగు గలవస్త్రకవచ మా తేజశ్శాలి యనురాగనిధి యని యుద్ఘోషించు

చున్నది. మొగంబునఁ దేజరిల్లుత్రిపుండ్రాంకితభస్మరేఖ యామహాప్రభావశాలి మృత్యుంజయుఁ డని ప్రకటించు చున్నది. ఇట్లుపరబ్రహ్మ యట్టు నొకసమీన మహాపురుషుఁ డచ్చటి కరుదెంచెను.

లోకంబున నకారణకారుణికు లగుమహామహిమవంతులు కొంద ఱుందురు. అట్టివారు నిరపేక్షులు, ఆత్మారాములు. అట్టివారిహృదయములందు దయారసంబు తొణఁకుచుండును. వారు విచారగ్రస్తులను జూచిన జాలి నొందుదురు. ఎట్టిదుర్ఘటకార్యములనైన సమకూర్తురు. వారికెల్ల మహిమలును గరతలామలకములు. లోకముసుద్ధరించుటకే కాఁబోలు వారు సర్వదా దేశాటనము చేయుచుందురు. మహానుభావుఁ డగు పరమేశ్వరుఁడు వారికి వశ్యుఁడై యుండును. పరోపకారమే వారికి సహజగుణము.

ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయుఁ
గుముదహర్షంబుఁ గావించునమృతసూతి
యర్థితుఁడు గాక జలమిచ్చు నంబుధరుఁడు
సజ్జనులు గారె పరహితాచరణమతులు.

అమ్మహాత్ముఁడు ఋషభ యోగీశ్వరుఁడు. సుమతియదృష్ట వశంబునఁ గాఁబోలు నెక్కడనుండియో యాకస్మికముగా నచ్చటి కరుదెంచెను. అమ్మహనీయునిఁ జూచి కొందఱు భయపడిరి, కొందఱు సంభ్రాంతులైరి, కొంద ఱావెన్నెలలోఁ గాంచి వానిపై రాగి . యనుకొనిరి. కొంద ఱిట్టివాఁ

డిక్కడి కింతపొద్దుపోయి యేల వచ్చెనో యని గుసగుస లాడుచు నొండొరులతో నేమియో చెప్పుకొన నారంభించిరి. కొందరితఁడు మహాత్మునివలె నున్నాఁడు. ఏదోప్రభావమును గనఁబఱచకుండఁడు. అని పలువురు పలుతెరంగులఁ జెప్పుకొనుచుండిరి.

ఆసర్వజ్ఞుఁడెవరిని నడుగకయె యచ్చటిసంగతి నంతయుఁ దెలిసికొనియెను. ఆయోగీంద్రునికర్ణములకు సుమతి యార్త నాదమువినవచ్చుచునే యున్నది. వానిమనంబున జాలి గలిగినది. ఆయన వారి కష్టమును బోఁగొట్ట నెంచెను. ఆతఁడు వెనుకముందు లారయక బిరబిర నరుదెంచి పిల్లవానిని శుభ వీక్షణములతో నవలోకించి సుమతితో నిట్లనెను:—
"శుభశీలా, విలపింపకుము. భయపడకుము దేవతలు నీయెడఁ బ్రసన్నులై యున్నారు. నీబిడ్డఁడు జీవింపఁ గలఁడు. ప్రాణ దేవతలు కాచియే యున్నారు. శోకము దిగఁద్రోచి నేను చెప్పెడిదాని శ్రద్ధయుంచి వినుము, సంసారమున వర్తించు వారికిఁ గర్మానుసారముగా సుఖదుఃఖములు చేబవళ్ళవలె క్రమముగా వచ్చుచుండును.

జీవుఁడు గర్భమున నున్నప్పుడే యాయుష్యము, కృత్యము ధనము, విద్య, మరణము, వీనిని గర్మదేవత యగువిధి నుదుట వ్రాయును. వీని నతిక్రమించుట కెవ్వరికిని సాధ్యము కాదు. కర్మవశముచే నెవని కీశ్వరభక్తి గలుగునో వాఁ డీశ్వరానుగ్రహమున సర్వశుభములను బొందును.

కావున సర్వప్రదాత యగునీశ్వరు నారాధింపుము. నీకు శుభము గలుగును. సర్వకాలసర్వావస్థలయందుఁ గూడ సర్వేశ్వరుని మఱవకుము." అని యిట్లు పలువిధంబుల బోధించి యాయింతి శోకానలమును దనబోధామృతముచేఁ జల్లార్చుచు యోగీంద్రుఁడు బాలకునిచేయి బట్టి చూచి తన యనిర్వాచ్యమహిమచేఁ బ్రాణశక్తి నొసఁగ నబ్బాలకుడు నిద్రించినవాఁడు మేల్కాంచిన తెఱంగునఁ గను లెత్తి చూచెను. దాసి కందఱు నద్భుత మందిరి. బాలకుఁడు మృతుండై మఱలఁ బ్రతికె ననియు, జచ్చినవాఁడు మఱల జీవింప చేరఁడు కావునఁ బ్రాణములు కడఁబట్టి మఱల స్వస్థానముఁ జేరె ననియు నీమహాత్ముఁడు మహామాంత్రికుఁ డనియు, నీతనిచికిత్స దొడ్డది యనియు, బలుపురు పలువిధంబులఁ గొనియాడుచు ఋషభయోగికి సాష్టాంగ దండప్రణామంబు లాచరించిరి. అప్పుడు సుమతికి మనంబున గలిగిన యానందమును వర్ణింప నేరికిఁ దర మగును ? యోగీంద్రుఁ డంత నూరకొనక మహాదయాళుపు గానఁ బవిత్రం బగుతనయఱచేత సర్వజ్ఞానులకును దివ్యౌషధం బగువిభూతి నుంచుకొని యభిమంత్రించి దాని నామాతా పుత్రుల పైఁ జల్లి వారిశరీరంబుల స్వహస్తంబుల నిమిరెను. ఆహా ! యేమిప్రభావము! ఏమివింత ! వారినెమ్మనులు దివ్యశరీరము లయినవి. వ్రణంబులు రూపు మాసినవి. ఆధి వ్యాధులెల్ల మాయ మైనవి. మాతాపుత్రులిరువురును దేవ

తలం బోలి ప్రకాశించిరి. ప్రత్యుపకారముఁ గోరకయే యాయనదలపై నెవ రుంచి మున్ను నారదుఁడు సువర్ణష్ఠీవి కిఁబలె ప్రాణదానం బొసఁగి కాపాడెను. మీ కా కథావృత్తాంతమును దెలిపెదను. ఆకర్ణింపుఁడు.

## ౧౮

పర్వతుఁ డనుముని జగత్ప్రసిద్ధుఁ డగునారదునకుఁ జెలియలి పుత్రుఁడు. వా రిరువురును స్వర్గమర్త్యపాతాళముల నిచ్చ వచ్చినట్లు చరించుమహాప్రభావసంపన్నులు. వా రొక్క నాఁడు స్వర్గమునుండి భూలోకము విహరించువేడుక నరుదెంచి యొకరిమనంబునం గలరహస్య మొకరికిఁ దెలుపకుండ దాపరా దనియు, నట్లు దాచినచో శాప మనుభవింపవలసిన వా రగుదు రనియు, బ్రమాణము చేసికొని యుచిత ప్రవర్తనముతో, గలసిమెలసి చరించు చుండిరి. అంత నొక్కనాఁ డమ్మునులు సృంజయుం డనురాజునింటి కరిగి తమరాక నెఱింగింప నారాజశ్రేష్ఠుండు వారి కెదురు వచ్చి యర్ఘ్యపాద్యంబులం బూజించి పీఠోపవిష్టులం జేసి చేతులు జోడించి

పాప మడఁచు గంగ, తాపంబడఁచు శశి,
పేదతనముఁ గల్పవృక్ష మడఁచు

పాపతాపదీనభావమ్ముల నడంచుc
దథ్యముగ మహాత్మదర్శనంబు.

అని శాస్త్రములు దెలుపుచుండు గాన మహాత్ములారా! తమదివ్యదర్శనంబుచేc గృతార్థుండ నైతి. వంశంబును పావనం బయ్యె. నా భాగ్యవశమునం గాదె తమ రిందు దయ చేసితిరి! అని భక్తిపూర్వకంబుగాc బ్రశంసింప వారలు రాజా! మేము కొన్ని రోజులు నీమందిరమున నుండc దలంచి వచ్చితి మనిరి. దానికిc బుధమిత్రుడు మహాభాగ్యంబకా నుప్పొంగి వారు తనయింట నుండుటకును, వారికి భోజనమజ్జనాదులకును, దగువసతు లొనర్చి సుకుమారి యను పేరం బరగు తనకుమారికను వారలకు వలయు నుపచారములc జేయుటకై నియమించెను. పర్వతనారదులు తద్గృహంబున సుఖంబుగా నివసించుచు, సుకుమారి యొనర్చు సపర్యల కానందించుచు నుండిరి. అంతc గొంతకాలంబునకు సుకుమారి యౌవనవతియయ్యెను.

సుకుమారసహజభావములచేc జెలువొందు నా యౌవన ప్రాదుర్భావమునc బుత్తళిబొమ్మవలెc జెలువు మించిన యమ్మించుబోణిం గాంచి నారదుండు మదనపరవశుండై "యే నెన్నc డీయువతికరుణావలోకనమునకుc బాత్రుడ నయ్యెద నీమగువయెన్నడు నన్ను భర్తగా గ్రహింప నిచ్చc గొనును? నేనీకలువకంటితో విలాసోక్తుల ముచ్చటించుచు నెన్నడు మెలసి వర్తించెదను" అని యిట్లు మనంబునc గోరిక

లుప్పతిల్ల నాచక్కోరబోణియందుఁ జిక్కినమనంబును మరల్ప జాలక విరాళిఁ దూలి తదేకపరవశత్వంబున నానాఁటికిఁ గృశాంగుఁడై యారహస్యంబును మేనల్లున కెఱిఁగింపక వర్తించు చుండెను. పర్వతుండును జర్యాలం బట్టియు; నెమ్మోని కృశత్వంబును బట్టియు నాతఁ డక్కోమలియందు బద్ధానురాగుండగుట యెఱిఁగి "ఔరా! నీచిత్తవృత్తి యెట్లుఁగనయ్యెను. నీమనోభావము నంతవఱకును దెలియనీక దాఁచితివి- నీకీరాచకూఁతురుపయిఁ గలకోరికఁ దెలుపవలదే! ఇది యెట్టిధర్మము. నీవు చేసినప్రతిజ్ఞ యేమయ్యె ? ఇట్లు నియమముఁదప్పిన నిన్ను నేనేల శపింపకుందును ? నీవు కామించినయీచెలువను బెండ్లియాడినపిమ్మట వానరముఖుండ వయ్యెదవు గాక. అని శాపం బిచ్చెను. దానికి నారదుఁ డలిగి "నన్ను శపించిన నిన్ను శపింపకుందునే; వినుము. నీవిక స్వర్గంబున కేగ నర్హుఁడవు కాకుందువు గాక" మనిపర్వతునకుఁ బ్రతిశాపం బిచ్చెను. అంతఁ బర్వతుఁడు సుఖాస్పదం బగునాకంబున కరుగరానివాఁడు కావున మానవలోకంబునఁ బవిత్రక్షేత్రంబుల కేగుచు, సజ్జనులతో సత్కాలక్షేపము సేయుచు, భూలోకవాసులచేఁ బూజింపఁబడుచు, నెందో యుండెను.

అంత నిక్కడ నారదుఁడు తనకూఁతుం గామించి యుండుటెఱింగి సృంజయుఁ డామెను. నారదున కిచ్చి పెండ్లిచేసెను. వివాహానంతరక్షణముననే శాపవచనంబునం జేసి నారదుఁడు మర్కటముఖుం డయ్యెను. సుకుమారి యావి

విశారవదనం బాలోకించి విరక్తి నొందకపరమభక్తితోఁ గోఁతి మొగము గలమగనికి సముచితపరిచర్యలు గావించుచు ననుకూలయై కాఁపురము సేయుచుండెను. భర్తలెట్టివా రైనను బతివ్రతలసూయఁ జెందక పతి నారాధింతురు గదా!

నారదుఁడు సుకుమారితో ననురాగమున మెలంగుచు నొక్కతఱిఁ గార్యవశంబుచే వనంబునకేఁగఁ నందుండు పర్వతుఁడు మామను గాంచి యాతనికలయావు నెఱింగి దగ్గఱ నమస్కరించి తనకిడినశాపం బుపసంహరింపు మని ప్రార్థించెను. నారదుఁడును శాపంబును మున్నొసంగినవాఁడవు నీవ కాన నీవు ముందు నాశాపంబును బాపుదు వేనిఁ బిమ్మట నీశాపంబును మరల్తు ననియెను. అంతఁ బర్వతుఁడు తా నిడినశాపంబును ద్రిప్పెను. నారదుండును దా నొసఁగిన శాపంబు నుపసంహరించెను. ఇరువురును శాపవిముక్తులైరి. పూర్వస్థితి వాటిల్లె. అంత నిద్దఱును స్నేహంబున మెలఁగి సుకుమారి యున్నయింటికే తెంచిరి. సుకుమారి పెనిమిటెం గాంచి పరపురుషునిగాఁ దలఁచి మాఱుమొగము పెట్టి లోని కరుగఁ బర్వతుఁ డామెకు దాము మున్ను శాపంబులచే నట్టుండులయుఁ, బిదప శాపనివృత్తిని గావించు కొనుటయు నెఱిఁగించి యామె నందియంబు వాపెను. ఆభార్యాభర్తలు సుఖంబుగా నుండిరి. పర్వతుఁడును స్నేహవశంబున నచ్చటనే యుండెను.

కొన్ని సంవత్సరములు చన సృంజయునికడకుఁ గొందఱు మును లరుదెంచి పర్వతనారదులను గాంచి ప్రస్తుతించి యేగినఁ నంతఁ బర్వతనారదులు "సృంజయా! మా కీక భూలోక దివ్యక్షేత్ర విచిత్రంబుల నవలోకింప నిచ్చ వొడము చున్నది. మే మీక్ష వేగెదము. బహుకాలము నీయింట నుంటిమి. నీయోగ్యత మాకు మెచ్చు వచ్చెను. నీ కేదైన నొకవర మొసంగఁ దలంచితిమి. కోరుము." అన నారాజు అయ్యలారా! మీరు నాగృహంబు పావనము గావించితిరి. మీరు సంతసించుటకంటెు నా కింకేమివరము కావలయును. ఇంతియ చాలును. అన నారదుఁడు "భూపాలా! నీకు దేవతలను మించినపుత్రుఁడు కలుగునట్లు వర మిచ్చితి ననియెను. పర్వతుఁడు దాని విని దేవేంద్రునివలన భయము రాఁగల దని శంకించి "భూమీశ్వరా! నీకు జన్మించెడువాఁడు దీర్ఘాయుష్మంతుఁడు కా నేరఁడు. ఇంద్రునివలన భంగపా టొందఁ గలఁ డని వాక్రుచ్చెను. దానికి రాజు చింతిల్లి "మహాత్ములారా! మీ వరప్రసాదంబుచేఁ గలుగువాఁ డట్లు కాఁ దగునే? సుపుత్రు ననుగ్రహింప వలదే" యన నారదుఁడు కరుణించి రాజా! భయపడకుము. కలుగఁబోవు నీపుత్రుని నీకు చేత నగునన్నివిధములఁ గాపాడు చుండుము. వాఁడింద్రుని వలనఁ జచ్చెనేని నన్నుఁ దలంపుము. నేను వచ్చి బ్రతికించువాఁడ. ఆజనింపబోవువాఁడు సువర్ణష్ఠీవి యను పేరం బరఁగు వానియం దద్భుతమహిమ చూపట్టును. మే మరిగి వచ్చెద మని పర్వతనారదు లేగిరి.

నారదునివర ప్రభావముచే సృంజయునకు సువర్ణష్ఠీవి యను పుత్రుఁడు జనించెను. బాలుని యొడలినుండి వెడలుచున్న మలమూత్రములు లాల, జమట, కన్నీరు, నివియన్నియు స్వర్ణమయం బగుచుండెను. బాలుఁడు క్రమక్రమముగాఁ బ్రవృద్ధుఁ డగుచు జననీజనకులకు మహానంతోష మొదవించుచుండెను. ఒక్కయెడ మూఢు లగుకొందఱు తస్కరులాబాలునివలన హేమము జనించు టెఱింగి వానియుదరమున హిరణ్యము గల దని యెంచి దానిని హరింప వలయు నని వానిని రహస్యముగాఁ గొనిపోయి యుదరము చీల్చి ప్రేగుల జల్లించి యందు సువర్ణంబుఁ గానక పాఱవైచి యేఁగిరి. అంత సృంజయుఁడు వెదకి పుత్రునిం గానక శోకించి యింద్రుఁడు హరించె నని యెంచి నారదుని దలంప నమ్ముని యేతెంచి శోకాపనోదనవచనంబుల నాతని శాంతచిత్తునిఁ జేసి " రాజా ! శోకింపకుము నీపుత్రుని ముచ్చులు ముచ్చిలించి చంపిరి. ఇప్పుడు వాఁడు నరకమున నున్నాఁడు నే నిక్కడనుండియే వాని బ్రతికించి యిందు రావించెదను. చూడుము. అని యామహానుభావుఁడు తన దివ్యమనంబున సంకల్పింప సువర్ణష్ఠీవి సజీవుఁ డై యచ్చటి కరుదెంచెను. వాని నిచ్చి సృంజయుని సంతసింపఁజేసి " సృంజయా ! యింద్రుఁడు నీపుత్రుని జంప వేచియున్నాఁడు. కావునఁ గడు

జాగరూకతతోఁ గాచికొమ్ము. అపాయము వచ్చు నేని నన్నుఁ దలఁచికొమ్ము." అని నారదుఁడు వెడలిపోయెను.

సురలోకమున నింద్రుఁడొక్కనాఁడు సువర్ణష్ఠీవి మొదలి నుండి వెడలునవియెల్లను గనకమయంబులు కావున నమ్మ హాధనవిభవముచేతను, మహాపరాక్రమముచేతను, దనను మించుననియు, మొక్కయై వంగనిది మ్రానై వంగునే యన్నట్లు బాల్యానంతరమున నాతని జయింప వశము గాద నియుఁ ద్రుంపనెంచి వానికి బర్వతనారదులు కాచియుందురు గాన స్వయముగ నబ్బాలుని జంపఁబోయినచో నమ్మునుల శాపమువలనఁ దనకు ముప్పు వాటిల్లు నని భయంపడి వానిని జంప నుపాయం బెద్దియుఁ గానక యోచించి కొండల రెక్కలం గూల్చుతనవజ్రాయుధమును బిలిచి "వజ్రమా! నీవు వ్యాఘ్రరూపమున నేగి సువర్ణష్ఠీవిని రహస్యముగా సంహ రించిరమ్ము" అని యాజ్ఞ నొసఁగ నది తరుణమునకై వేచి యుండెను.

మర్త్యలోకమున సృంజయ రాజకుంజరుం డొక్కనాఁడు భార్యలతోడను బుత్రునితోడను విహారార్థము గంగానదీ ప్రాంతమున కేగెను. వారా భాగీరథిని దర్శించి నమస్క రించి తత్ప్రవాహ జనితమధుర రవమ్మువలనఁ గర్ణేంద్రియ మును, వినిర్మలమనోహరాకార దర్శనంబువలన నేత్రేంద్రియ మును మధురజలపానంబువలన జిహ్వేంద్రియమును, బరిసర కమలవనగంధంబువలన ఘ్రాణేంద్రియమును, వాతావ్యాప్తిచేఁ

బయిం బడుచున్న దాని తుంపురులవలనఁ ద్వగింద్రియమును, నానంద పారవశ్యము నొందఁ గొంతతడ వచట విహరించిరి. అంతటఁ దత్సమీపవనంబుఁ జేరి యచటివృక్షచ్ఛాయల నాసీను లగుచుఁ దరువులపై జిలిబిలిపలుకులగీతములఁ బాడు వింతవింతలరంగులచేఁ జెలఁగువిహంగములఁ గని చెంగలిం చుచు, నల్లిబిల్లిగ నల్లుకొనియున్న వల్లికాతల్లజంబుల నీక్షించి మెచ్చుచు, మెప్పుఁ గొలుపుపుష్పాకులతిన్నెలపైఁ జెన్నుగ విహరించుచు, రసకలితకుసుమవిసరంబులఁ గని యానం దించుచు, నందు నివ్వటిలుమవ్వంపు బువ్వులం గోసి యలంక రించుకొనుచు హర్షోత్కర్షంబునఁ గొంతతడవు వర్తించిరి.

ఇట్లొకరికొకరు దూరస్థులై యేమరపాటున నుండుతఱిఁ దత్ప్రాంతమున వేచి పొంచి యున్న పెద్దపులి కుఱ్ఱనిపయిం బడి పొట్టఁ జించి నిమిషమాత్రంబునఁ జంపివైచి మటుమాయ మయ్యెను. ఆతనిదాది దానిం జూచి విచారగ్రస్తయై ఱొమ్ము మోఁదుకొనుచు నేడ్చుచు వచ్చి వినఁజాలనియాకర్ణ కఠోరవార్తను నృపజయున కెఱిఁగించెను. అది విని యతం డులికిపడి గుండె వ్రక్కలు గాగ హాపుత్రా యని పెద్ద పెట్టున నేడ్చి పుడమిపైఁ బడి మూర్ఛిల్లి కొంతవడికిఁ దెలిసి పుత్రునిదరి కేగి వాని మృతకళేబరంబుఁ గని కనుమరపిల్లి యంతలో జ్ఞప్తి దెచ్చుకొని నారదుని స్మరించెను. అంత మనోవేగంబున ముని యచ్చటఁ బ్రత్యక్షమై నిలిచి రాజా భయ మందకు మని తన దివ్యప్రభావంబునఁ దత్క్షణంబున

సువర్ణష్ఠీవిని బ్రదికించి యందఱకు నానందంబుఁ గావించి యాతఁ డికఁ దీర్ఘాయుష్మంతుఁడు గాఁ గలఁ డని దీవించి యేగెను.

అంతట వారందఱు నింటికిఁ జనిరి. సువర్ణష్ఠీవి సంతసం బెసఁగు తెఱంగున వర్తిల్లుచు నతనిపిమ్మటఁ బృథ్వీభారముఁ బూని శిష్టానుగ్రహదుష్టశిక్షణంబులు సలుపుచు జన్నములఁ జేయుచు శతాధికసహస్రవర్షంబులు రాజ్యముఁ జేసెను.

కావున నిట్లు మహాత్ముల యనుగ్రహంబుచే జీవితు లగు వారనేకులు గలరు. మున్ను హరిశ్చంద్రుని పుత్రుఁడు లోహితుఁడు పునర్జీవితుం డగుట వినరే! మఱియు నోషధుల సామర్థ్యముగూడ నెన్న శక్యము గాదు. ఓషధీసామర్థ్యమున లక్ష్మణుండు మఱల బ్రతికినట్లు శ్రీరామాయణమున వినమే! విశ్వామిత్రుఁడు తపశ్శక్తిచేఁ బునస్సృష్టిఁ గావించి యనేక జీవరాసులఁ గూడ సృష్టి చేసెగాదే! మానవ లోకంబు పుణ్యనిబిడితమై యుండునంతవఱకు మహర్షులు మున్నగువారు పుడమిపైఁ జరింతురు. అట్లు వారు ప్రవర్తించునెడల నెట్టి ప్రభావములనైనఁ జూపింతు రనుటలో నాశ్చర్య మేమియు నుండదు. కావున మహానుభావులు శాపానుగ్రహములచేఁ జంపుటకుఁ బెంపుటకుఁ జాలుదురు. సందర్భవశముచే నీకథ నెఱింగించితి. ప్రస్తుతాంశమునఁ దరువాతి వృత్తాంతము నాకర్ణింపుఁడు.

ఇట్లు సుమతి యగు సుమతి పెనిమిటి యవమతివలన నగతిక యయ్యును సుగతిం గాంచి. యోగిపతి మహిమమున కచ్చెరు వంది యింద్రాధిపత్యము చేకూరిన నెంతయానంద మొదవునో యంతకు వేయిమడుంగులు హర్షోత్కర్షంబుం గాంచె. ముని కాంతుని చరణనళినములపై వ్రాలుచు లేచుచు సారెసారెకుం బరమభక్తితో వందనశతము లర్పించుచునిలువంబడి కేలోడ్చి యిట్లనియె: 'మహాత్మా! పరిపూర్ణానుగ్రహముచేం దమ రీదాసురాలి యెడం గావించిన మహోపకార మెంత యని నుడువుదాన? నిష్కారణముగాం బిచ్చికుంటుపై, పావన గంగానదీప్రవాహము పారలినది. నాజీవితమున నెన్నటికైన మిమ్ము మఱవనేర్తునే? నాబిడ్డ నిట్లు నీరోగి నొనర్చి యొసంగుట వేయి స్వర్గములం గూర్చుటయే. సహస్రకరుని తేజమును మిణుంగురుపురుగుంబోలె భవన్మహిమాతిశయము నెవరు గాంచ నేర్తురు? పరమేశ్వరుండే దీనురాలి ననుగ్రహించుటకై భవ త్స్వరూపమున నిట నవతరించె ననుట నిక్కము. నిరవధిక కృపాపారీణులగు తమకు ననాథ నగునేను చంద్రునకు నూలుపోంగన్న ట్లొక్కవందనం బాచరింతు గాన మఱేమియుం జేయనేరను!"

ఇట్లు నుడువుచు భక్తిపారవశ్యంబునం దన పాదములమీఁద వ్రాలిన యాలలనాతిలకమును గరంబుల లేవనెత్తి ముని వృషభుం డిట్లనెను:—

“ బిడ్డా ! మీ కింకను మే లగుఁగాక ! నీవు మహారాజ్ఞివై పెక్కేండ్లు సౌభాగ్యవతివై సదారోగ్యముతో జీవింతువు. నీ జీవిత కాలమున నెన్నటికిని ముదుసలితనము చెంతఁ జేరకుండును. పుత్రీ ! యీనీపుత్రుండు భద్రాయు వనుపేరఁ బ్రసిద్ధుఁడై భద్రాయువై మహావైభవంబునఁ జిరకాలము రాజ్య మేలఁ గలఁడు. శత్రుకోటుల జయించి శాశ్వత యశంబుఁ గాంచి యీశ్వరానుగ్రహ మొందఁ గలఁడు. ఈబాలుఁడు సర్వవిద్యాపరిపూర్ణుఁడై మఱలఁ బైతృకం బగు రాజ్యము వడయునంత వఱకును మీ రీవైశ్యుని గృహమ ననే యుండుఁడు. ఈతఁ డత్యుత్తముఁడు ” అని వక్కాణించి పద్మాకరుని వీక్షించి యమ్మాతాసుతుల నాదరించుట పరమ ధర్మం బని బోధించి యావైశ్యసత్తమునిచేఁ బూజితుఁడై ఋషభుఁడు నిజేచ్ఛం జనియెను. సుమతీ భద్రాయువు లందు సుఖంబున నుండిరి.

పింగళామందరుల చరితంబును, కీర్తిమాలినీభద్రాయువుల జననంబును, వింటిరిగదా ? ఆపింగళయే కీర్తిమాలినిగను, మందరుఁడే భద్రాయువుగను, జన్మించిరి. పింగళ వేశ్యాయయ్యును స్వకులోచితవృత్తితో వర్తించుచు మహాత్ముఁ డగు ఋషభయోగీంద్రున కొనర్చిన సపర్యావిధానముచే సీమంతినీమహాదేవికిఁ బుత్రిక యై యత్యుత్తమజన్మంబు నొందెను. మందరుఁడు కులోచితవృత్తులను మాని కడుదుష్కృత్యము లొనర్చుటచే విషబాధాసహితుఁడై భద్రాయువుగా జనించి

మందరజన్మంబున యోగీంద్రుని బూజించుటం జేసి తత్పుణ్యావిశేషమున యోగీంద్రానుగ్రహపాత్రుండై పునర్జీవితుండై దివ్యవరంబులం బడసెను. కర్మఫలంబులు, జన్మావిశేషంబులును, బలు విధంబులుగా నిట్లు చిత్రవిచిత్రంబులై యొప్పుచుండును. మహాయోగీంద్రులమహిమ లతిమానుషంబులు. అట్టివారిని దర్శించినను, బూజించినను దత్ఫలంబులు గణింప నలవి గాక యైహికాముష్మికసుఖసాధనంబులై జన్మాంతరమునం గూడ కోటిగుణితఫలంబొసంగు ననుటకు సందియములేదు. మహాత్మపూజన మెట్టి దుష్కృతునైనను బవిత్రునిం జేయు ననుట కిదియే దృష్టాంతముగా నెన్నదగును.

## ౨౧

ఇంకను భద్రాయురుపాఖ్యానము నుడువవలసి యున్నది. మేఘనిర్ముక్త బాలచంద్రునికైవడి నానాటికి నభివృద్ధిం గాంచి శోభిల్లుచు వసంతాగమమున సూర్యునిచందమునం దేజరిల్లు భద్రాయువు గుణరత్నాకరుండగుపద్మాకరునింట వర్తించుచుండెను. ఆపద్మాకరునకు సునయుం డను తనయుండు కలండు. ఆబాలకుండును గొంచెమించుమించుగా భద్రాయువుసీడువాండే. మందరసుకుమారాకారముచేతం గూడ సునయుండు భద్రాయువు

నకు సాటియై యుండును. రాజవైశ్యపుత్రుల కిరువురకును వయస్సు హెచ్చుచున్నకొలఁది స్నేహముగూడ హెచ్చుచుండెను. ఆనంతను లొకరి నొకరెడఁబాయక రత్నభూషణాలంకృతాంగులై, జన మనోహరులై యొప్పుచు శైశవమున విద్యాభ్యాసమునకుఁ గడంగిరి. పద్మాకరుఁడును సంతోషవికచహృదయ పద్మాకరుఁడై నిజపుత్రునింబోలె రాజపుత్రుని సాదరకటాక్షముల నవలోకించుచు నకాలమున యుక్తకర్మకలాపంబులఁ గావించి యతిశ్రద్ధాళుఁడై విద్యలఁ జదివించు చుండెను. గర్భాదిగా నెనిమిదవవర్షమున విప్రునకును, బదునొకండవవత్సరమున రాజన్యునకును, బండ్రెండవయబ్దంబున వైశ్యునకు, నుపనయనసంస్కారం బాచరణీయము. కావునఁ దన పుత్రునితోఁగూడ భద్రాయువున కతఁ డుపనయనంబుఁ గావించెను. అంత వారిరువురు విద్యాబుద్ధుల మెలంగుచు, వినయవిధేయతల కునికిపట్టులై సుగుణంబులఁ జెలఁగుచుఁ బదునాఱువత్సరములప్రాయమువారైరి.

ఇట్లుండ నొక్కయెడ వారల ననుగ్రహింపఁ గోరి పరమ మునీంద్రుఁ డగుఋషభయోగి పద్మాకరునిసద్మంబున కరుదెంచెను. పద్మాకరుఁడును జంద్రదర్శనముచే సముద్రము వోలె నామహానీయుని గాంచుటచే హృదయమునం బ్రమోద ముప్పొంగ భక్తిప్రయుక్తంబుగా షోడశోపచారంబులు చేసి పూజించె. అంత నమ్మునితిలకుని వీక్షించి

చంద్రుని గాంచినచకోరకంబులభంగి యానందవివశు లై సుమతిభద్రాయువులు శివయోగిపాదయుగళంబునకు సాష్టాంగ దండప్రణామము లాచరించి తమనివాసంబునకుఁ దోడ్కొని వచ్చి యుచితపీఠిపై నాసీనుం జేసి సేవించిరి. అంత నాయోగి హృష్టుండై భద్రాయువుతో వాత్సల్యంబున నిట్లనియెను:—

“వత్సా! నీకుఁ గుశలమా? జననియు నీవును నారోగ్యమున నున్నవారే? బిడ్డా! నీవు లెస్సగా విద్యాసంగ్రహణము సేయుచుంటివా? గురువులకు బాగుగా శుశ్రూష యొనర్పుచుందువా? కుమారా! నీకుఁ బ్రాణసఖుండ నగు నన్నెవ్వాడైనఁ దలఁచు చుందువా? తండ్రీ! నీశరీరము దుర్బలము గాక యనామయముగా నుండెనే? అని యిట్లు ప్రియాలాపంబుల, బహుప్రకారంబుల నక్కుమారుని బలుకరించుచు, సుమతి యోగక్షేమంబు లరయుచు వినోదింపఁజేయు చుండెను. అప్పుడు సుమతిబిడ్డ నాయోగీంద్రునిపాదములపైఁ బడవైచి ముకుళితహస్తయై సవినయముగా, “మహాత్మా! గురువర్యా! వీఁడు నీబిడ్డఁడు. కన్నవాఁడును, పెంచినవాఁడు, నాపత్కాలమునఁ గాపాడినవాఁడు, నృపతియు, నుపదేశించువాఁడును, వీరైదుగురును దండ్రు లని పెద్దలు చెప్పుదురు. కావున వీనికిఁ దమరు ప్రాణతః జనకులరు. కావున నీకుఱ్ఱని శిష్యునిగాననుగ్రహింప వేడెద. బంధుజనములచేఁ గూడ విడువఁబడినయనాథల మగుమమ్ముఁ బరిపాలింప

వలయును. ఈమిాదానునకు సత్పురుషు లాచరింపఁ దగు ధర్మముల నుపదేశింపఁ బ్రార్థించు చున్నదాన!" అని విన్నవించెను.

మహాత్ములయవతారము లోకోపకారమునకే యగు చుండును. సుకృతాత్ములు నాస్తికులు కాక ధర్మశీలు రగు వారి కేదైన నుపదేశింతురు. ఋషభయోగి వచనముల కలరి "కుమారా! శ్రుతిస్మృతిపురాణములయం దెయ్యవి సనాతన ధర్మము లని పేర్కొనఁ బడు చుండునో వానిని నీకు సంగ్రహించి బోధించెదను, శ్రద్ధాళుఁడవై సదాచార పరుఁడవై పరాకు నొందక సావధానమనంబున నాకర్ణింప వలయు" నని తెలుప భద్రాయువు యోగి చెప్పినట్లు విను చుండెను." ఋషభుఁ డిట్లుపదేశించుచున్నాఁడు

## ౨౨

భద్రా! కులాశ్రమంబులకుఁ దగునట్లు సత్పురుషు లాచరించు ధర్మములనే యవలంబింపుము. దైవతములయాజ్ఞకు జవ దాఁటకుము. దేవతల నిందింపకుము. ధేనుగురుదేవవిప్రుల యం దెప్పుడును భక్తి గలిగి యుండుము. సాధ్యములు గాని వస్తువులయం దపేక్షఁ గొనకుము. చండాలుఁ డైనను గృహ మున కతిథిగా వచ్చెనేని వానిని సత్కరింపుము. ప్రాణా

పాయః వేళ్ల నైనను సత్యమును విడువకుము. గో బ్రాహ్మణుల రక్షింప వలయు నెడ నించుక యసత్యము పలికినను దోషము లేదు. సర్వవిధములచేతను దంభమును విడువ వలయును. పరస్త్రీపరధనములయందును, బ్రాహ్మణద్రవ్యములయందును లేశమేని యాశ గొనకుము. సత్కథలయందును, సదాచారములయందును, సద్వ్రతములయందును, సద్విద్యయందును, ధర్మార్జనమందును, నిత్యము ప్రవృత్తుడవు కమ్ము. స్నానజపహోమ వేదాధ్యయనపితృతర్పణములయందును, గోవిప్రాతిథిపూజలయందును, రవంతయేని యాలసింపకుము. క్రోధద్వేషభయము లొందుట, కొండెములం జెప్పుట, దుర్జనులయిండ్ల కేగుట, కుటిలత్వము, మోహము, తొందరపాటు, అనునీచగుణములను బ్రయత్నించి విడువ వలయును. క్షత్రధర్మమం దాశ యున్నను నిష్కారణముగాఁ బ్రాణిహింస సేయకుము. వ్యర్థములగువిరోధపరితాపములను, బరనిందయును విడువుము. స్త్రీద్యూత పానముల యందు స్త్రీదాసులయందు, దుర్విషయములయందు నాసక్తి మానవలయును. సుఖవంతులయెడ మైత్రియు, దుఃఖితులయెడఁ గరుణయుఁ, బుణ్యవంతులయెడ సంతోషమును, గుబుద్ధులయెడఁ దటస్థభావమును జూపు చుండుము. అత్యాహారము, అతిక్రోధము, అతినిద్ర, అతిపరిశ్రమము, అతిసంభాషణము, అతిక్రీడ, వీనిని బొత్తుగా వదలుము. అతివిద్య, అతిశ్రద్ధ, అతిపుణ్యము, అతిధర్మాసక్తి, అత్యుత్సాహము

అతియశస్సు, అతిధైర్యము, వీనిని సంపాదింపుము. స్వభార్యలయందు గామము, శత్రువులయందుఁ గ్రోధము, సత్కార్యములయం దాసక్తి, యధర్మములయం దసూయ, సజ్జనులయం దనురాగము నుంచుము. దుర్మంత్రులతో నాలోచింపకుండుట, దుర్జనులమాట పాటిగొనకుండుట, వలయును. ధూర్తుని పరోక్షమున నప్రియకారిని, గ్రూరుని, జపలుని, వంచకుని, ఖలుని, పాపాత్ముని, నాస్తికుని, వీరిని జెంతఁ జేరనీయ రాదు. తనను దాశ్లాఘించుకొనఁదగదు. పరునియభిప్రాయము నెఱిఁగి చరింప వలయును. ఆత్మరక్షణమునం దప్రమత్తుఁడవై యుండవలయును. భృత్యులమాట నమ్మకుము. చోరుఁ బొత్తుగా నమ్మకుము. ధనకుటుంబపుత్రులయం దతి ప్రేమ నుంచ వలదు. పతివ్రతయగు భార్యయొక్కయు, తలిదండ్రులయొక్కయు, సజ్జనులయొక్కయు, గురువులయొక్కయు, మాటలయందు నమ్మకముంచుము. మంత్రి యొనర్చు పనియందు సందియము నొందకుము. అనాధుని, దరిద్రుని వృద్ధుని, స్త్రీని, బాలుని, నిర్దోషిని, ధనప్రాణబలములచేఁ గాపాడుము. అపాత్రుఁడైనను, సుపాత్రుఁడైనను, నీచుఁడైనను, యాచించినచో యథాశక్తిగా నొసంగఁ దగును. రాజులకును, ద్విజులకును, భూషణము గావునఁ గీర్తి నార్జింపుము. కీర్తివలన లక్ష్మియుఁ బుణ్యమును గలుగును. గజాశ్వహేమరత్నరాసులనైనను గీర్తికి భంగకరము లగునేని విసర్జింపుము. శరణాగతుఁ డయ్యేనేని

శత్రువునైనను గాపాడుము. జననీజనకగురులు కోపించి నను, బ్రాహ్మణులు పుత్రులుఁ దప్పుఁ గావించినను గోపింపక రౌమార్చుకొనుము. ఉత్తమబ్రాహ్మణులకు హితమొన ర్పుము. సంకటము సంభవించెనేనిఁ బ్రభువును గాపాడవ లయును. ఆయుర్బలయశస్సౌఖ్యధనపుణ్యములను వృద్ధిసేయుము. దేశకాలోచితము లగుకార్యములను జేయుము. ఇతరుని బాధింపక బాధ నడంపుము. చోరుని, దుష్టుని, శత్రువును బాధింపుము. నిద్రాభంగము సేయకుము. శీఘ్రముగా భుజించు చుండుము. ప్రియపూర్వకమై యల్పాక్షరమై యాధిక్యార్థముగల వాక్యమును బలుకవలయును. ఆపదలు, శత్రువులును, బైకొన్నను భయపడవలదు. జ్ఞాతిబంధుమిత్ర భార్యాపుత్రులయందును, భోజనపంక్తియందును సమభావ ముతో మెలంగవలయును. సత్పురుషోపదేశమందును, బుణ్య కథాశ్రవణమందును, విద్యాగోష్ఠియందును, ధర్మాచరణ మందును, బరాఙ్ముఖుఁడవు కాకుము. పవిత్రమై, పుణ్యా త్ములతో నిండికొనిఁ బ్రహ్మణ్యులున్న, ప్రసిద్ధపుణ్యక్షేత్ర మున నివసింపుము. వేశ్యలు, కాముకులు, నివసించుచోట నుండఁ దగదు. నీ వొకదేవుని మాత్రము నమ్మినను నితర దేవతలం గూడఁ బూజింపుము. ఎల్లపుడును, బరిశుద్ధుఁ డవును, సమర్థుఁడవును, స్థిరచిత్తుఁడవును, షడ్వర్గజేతవు, నేకాంతవా సివిఁగమ్ము. బ్రాహ్మణులు, వేదవేత్తలు, యతులు, వ్రతస్థులు పుణ్యనదీవృక్షతీర్థములు, ధేనువృషభరత్నములు, పతివ్రతలు

కనిపించినవెంటనే నమస్కరింప వలయును. గృహదేవతలఁ గొలువుము. రాత్రి యైదుగడియలప్రొద్దుండగా బ్రాహ్మముహూర్తమున నిద్రమేల్కాంచి నేలపై కూర్చుండి నిర్మలమనస్సుతో నాచమనము చేసి, గురువులను పార్వతీపరమేశ్వరలక్ష్మీనారాయణవాణీహిరణ్యగర్భులను, కుమారస్వామిని, వినాయకుని, నింద్రాదిదిక్పాలురను, మునుల, నుదయింపఁబోవు సూర్యునిభక్తితో ధ్యానింపవలయును. పరమేశ్వరునకు గంధపుష్పఫలతాంబూలాదుల నివేదింపక తామనుభవింప రాదు. జపదానకర్మస్నానహోమతపంబుల నొనర్చి పరమేశ్వరార్పణము సేయవలయును. ఏ సేవను జేయుచుండినను సర్వేశ్వరుని ధ్యానింపవలయును. ముఖంబున భస్మత్రిపుండ్రాదులనలంకరించుకొనియే మంత్రపఠనము సేయవలయును. ఇష్టదైవమునకు శరణాగతుఁడు కావలయును"

౨౩

వత్సా! ఇంతవఱకు నీకు సర్వపురాణములయందును చెప్పఁబడినధర్మములను సంగ్రహముగాఁ దెలిపితిని. బిడ్డా! ఇంక నీకు రాజధర్మములను ననేకశత్రువులు మూఁగియుండునప్పుడు వర్తింపవలసినవిధమును బోధించెదను. అది పలితరోమశమార్జాలమూషకసంవాదం బనునితిహాసముగాఁ జెప్పబడి యున్నది.

"ఒకమహారణ్యమున విశాలవటవృక్షముక్రింద లాగఁజేసి కొని పలితుఁ డనుపేరుగలమూషికము వసించు చుండును. ఆన్యగ్రోధపాదపంబుపై రోమశుఁ డను మార్జాలము కాపురము సేయు చుండును. ఎట్లైన నాయెలుకను మ్రింగవలయునని యాపిల్లి పొంచి యుండెను గాని పలితుఁ డది యెఱిఁగి కడు నుపాయముతో మెలఁకువ గలిగి దాని బారికిం జిక్కక తిరుగు చుండును. ఒకబోయవాఁడు ప్రతిదినము నంజకడ నామఱ్ఱిచెట్టుచెంత మృగములఁ బట్టుటకై యురు లొడ్డి వేకువ నచ్చటికి వచ్చి యందుఁ బడ్డ మృగాదులఁ గైకొని పోవు చుండును. ఇట్లుండ నొకరాత్రి రోమశుఁడాహారార్థ మరిగి యందందుఁ దిరుగుచుఁ బ్రారబ్ధవశమున నాయురులలోఁ జిక్కుకొని కదలనేరక తనకు మృత్యువాసన్న మయ్యె నని పరితపించు చుండెను. ఇది యిట్లుండ బలితుండును దన్నిశానమయమున నెఱకై తిరుగుచు నయ్యూరిచెంతకు రాగ నాబావురుగాఁడు దానిం బట్ట నెంచి హుమ్మని బూకరించుచుఁ బైఁ బడ వచ్చెను గాని కాలిబందముచే దరికి రాఁజాల కుండెను. ఆహా దుష్టులు చచ్చుకాలము దరి కొనసనని యెఱింగియు నకృత్యముల మానరుగదా, ఆయెలుక మార్జాలహుంకారమునకు వెఱచి చచ్చితిగదా యుని తప్పించుకొని కొంతదూరముఱికెను. ఇంతలో హాలికుఁడను ముంగిసయుఁ జంద్రకుఁ డనుగూబయుఁ దత్సమీపమున నాహారము కై తిరుగుచు నాకస్మికముగా నయ్యెలుకను

వీక్షించి దానిం దినుటకై వెంటఁ దగిలి పైఁ బడ వచ్చెను. పలితుఁ డాదెబ్బఁ దప్పించుకొని యిరుప్రక్కల శత్రువు లుండుటం జేసి యెందును బోవఁ జాలక యొదిగియుండి పిల్లి వైపున జూడ నది యురులలోఁ జిక్కుపడి యున్నట్లు పొడ కట్టెను. అందున నెలుక సంతసించి నాయదృష్టము ఫలించెఁ గదా యని యెంచి మార్జాలమున కనతిదూరమున నుండెను. ముంగిసయు గూబయు నెలుకను దన్నుకొని పోవచ్చును గాని యది బిడాలముచెంగట నుండుటచే మార్జాలము తమ్ముఁ జంపు నని వెఱచి దూరదూరముగా నిలిచి యెలుకపైకి రాఁజాలక యది యచ్చటినుండి వచ్చినపుడు తినవచ్చునుగదా యనిపొంచి కాచుకొని యుండెను. తెలివి మాలినగూబ ముంగిసలు పిల్లి యురులలోఁ జిక్కె నని యెఱుంగవు. అప్పుడు పలితుండు రోమశునిచెంగట నున్నచోఁ హరిక చంద్రకులు దానికి వెఱచి తనపైకి రాఁ జాల రనియు, రోమశునివలనఁ దనకు భయము లే దనియు నెఱిఁగి పిల్లిచెంగట నందనియట్లుగా నుండెను.

ఆపుడు మూలఁడు తనను జంపవచ్చు నను భీతిచే నెలుక వలనఁ దనకు బ్రతుకు కలుగు నని యెంచి పిల్లి యెలుకతో నిట్లనియెను.

"మిత్రమా! యే నిట్లురులలోఁ జిక్కితిని. నీవలనఁగదా యిప్పుడు నాబాధ తొలఁగ వలయు. ఆర్తరక్షణ ముత్తమ మని పెద్దలు చెప్పుదురు. నీకు వేర చెప్పవలసిన దేమి

యున్నది? మాలఁడు వచ్చువేళ యాగుచున్నది. దయయుంచి యురులఁ దెగఁ గొఱికి నన్ను రక్షింపుము, నీమే లెన్నటికి మఱువను. సమయము వచ్చినపుడు ప్రత్యుపకారము చేయుదును. మన మొక్కచో నివసించువారముగదా!" యని వేఁడ నెలుక యిట్లనియెను.

"మిత్రమా! నీమూలమునఁగదా నేను బ్రతుకుచున్నాను; నీచెంగట లేకున్న గూబముంగిసలవలన నాప్రాణములు నిలుచునే! నీయుపకారమును నేను మఱవను. సమయముజూచి నిను గాపాడెదను. నీవు నాకు శత్రుపక్షములోనివాఁడవుగదా! ముందుగా నురుల నెట్లు గొఱుకుదును"

"మిత్రమా! యిట్లందువేల? నే నంతధర్మము తెలియని వాఁడఁ గాను. నాప్రాణముఁ గాపాడినచో నీకపకార మొనర్తునే? దేహికి గుణము ప్రధానము గాని జాతిప్రధానము గాదు. నావలనఁ గదా యిప్పుడు నీకు భయము తప్పినది. ఇంకఁ దడవు సేయ నగునే! కృతఘ్నతాబుద్ధి యెరికిం గూడఁ దగదు. రమ్ము, త్వరగా రక్షింపుము." అని పిల్లి పలికెను.

ఇవి యిట్లు భాషించుచుండ గూబముంగిసలు పలి తనవిషయమున నిరాశఁ జేసికొని యేగెను. ఇంతలోఁ దెల్లవారెను. మాలఁడు వేఁటకుక్కల వెంటఁ దీసికొని పెద్ద గుదియచేఁబూని ప్రళయకాలకృతాంతునివలె భయంకరాకారుఁడై తగువారలతోఁ గూడ నరుదెంచుటం గాంచి

పిల్లి కేలొత్తిప్పి దీనత్వముతోఁ బ్రార్థించు చుండ మాలఁడు దరిసోను వేళ నురులఁ జిటుక్కున గొరికి యెలుక కలుగులో దూరును రోమశుఁడును దటాలునఁ జెట్టుపై కెక్కెను. ఉభయు లకును బ్రాణాపాయము తప్పి సుఖము గలిగినది.

"అంతట నాకిరాతుఁడు తెగియున్న యుచ్చులం జూచి వగచుచు" మార్జాలమూషికములు తప్పించుకొని పోవుటఁ గాంచి పెదవిఁ గొరికికొనుచు నిరాశుఁడై యింటి కేగెను.

"పిమ్మటఁ జెట్టెక్కినరోమశుఁడు ప్రాణములు కుదుటఁ బడఁ బలితు నుద్దేశించి "మిత్రమా! యింకనైనను వెలుపలికి రావేమి? భోయువాఁడేగెను. నాప్రాణముల నిల్పి పుణ్యము గట్టుకొంటివి. మన మొకరివలననొకరము బ్రదికితిమి. ఇఁక గలసిమెలసి మిత్రత్వమున నుందము రమ్ము." అని పలుక నెలుక యిట్లనియె "అయ్యా! మిత్రులని, శత్రులని, తెలిసికొనుట యతిదుర్ఘటము. లోకములోనివారలు తమతమ కార్యముల నెఱవేర్చుకొనుటకై శత్రువులం మిత్రత్వమును, మిత్రులు శత్రుత్వమును బూనియుందురు. అట్టివారలను శత్రు లని, మిత్రు లని యెట్లు నమ్మనగును? నేనా నీకు భోజ్యపదార్థమను. నీవా తెల్లవారునంతవఱకు నాహారము లేక మిగుల నాఁకలిగొని యున్న వాఁడవు. సహజవిరోధివి. మాంసప్రియుఁడవు ఇట్టినీతో మైత్రి యెట్లు పొసఁగును! నీవెన్ని చెప్పినను నమ్మఁదగదు. బల వంతునితోఁ బ్రయోజన మున్నచోఁ గార్యముండునంత

వఱకు చెలిమిఁ జేసి తుదిని దొలఁగ వలయు. లేనిచోఁ గీడొ దవు ననియు, నమ్మఁదగినవారినైనను స్వోవా నమ్మక తగి యుండునంతవఱకు నమ్మి తననితరులు నమ్మునట్లు చేసికొన వలయు ననియు నిట్లుండుట ధీమంతులలక్షణ మనియు శుక్రాచార్యుఁడు తెలిపిన నీతి వినమే? కావున మన మైత్రి యింతవఱకు చాలును. " అని ప్రియాలాపములతో సత్క రించి పంపెను.

" కావున నల్పులయెడ, నధికులయెడ, సంకటములు సంభవించినయెడల నిట్లు మెలఁకువతోఁ బ్రవర్తింప వలయును "

" కుమారా నీకింకనొకటి చెప్పవలసి యున్నది, వినుము. పరిశుద్ధప్రదేశమునఁ గూర్చుండి, పద్మాసనస్థుఁడ వై, మొగంబున భస్మము నలఁది, యింద్రియములను విషయముల పైఁ బోనీక, నిశ్చలచిత్తుఁడ వై, షడక్షర మంత్రమును జపించి, శివకవచముచే నాత్మసంరక్షణముఁ జేసికొనుము. " అని మంత్రకవచముల నుపదేశించి మఱియు భస్మము నాతని యొడలి కలఁది, పండ్రెండువేల మతంగగజములబలము గలుగు నట్లనుగ్రహించి మహాశంఖమును, దివ్యఖడ్గమునొసఁగి యిట్లనెను:—

" భద్రా! యేనొసఁగిన యీఖడ్గము కనిపించినంతనే యెట్టిశత్రువులైనను హతు లగుదురు. ఈశంఖారవంబును విన్న మాత్రముననే గుండెలు తల్లడిల్ల నెట్టి విపక్షులైనను గూలు దురు. పుత్రా! ఈశంఖఖడ్గప్రభావముచేతను, ద్వాదశసహస్ర

గజబలముచేతను, శైవకవచ ప్రభావమునను, భస్మధారణా సామర్థ్యమువలనను, శత్రుకోటుల జయింపఁ గలవు. పైతృకంబగుసింహాసన మధిష్ఠించి నిర్మలయశంబుతో భూమండల మేలుదువుగాక !” అని దీవించి భద్రాయువుచేఁ బూజితుఁడై ఋషభయోగీంద్రుఁడు వెడలిపోయెను.

౨౪

ఇంతకుమున్ను దశార్ణాధిపతిచరిత్రమును గొంత విని యే యున్నారు. ఆరాజన్యుఁడు సామాన్యుఁడు కాఁడు. విస్తీర్ణ రాజ్యము, సవక్ర మగువిక్రమముఁ గలధీరుఁడు. ఆతనికి మగధ నాథుఁ డగు హేమరథుఁడు ప్రబలశత్రువు. హేమరథుఁడు తొలుదొల్త విరోధి కానట్లు కనఁబట్టుచుండెను గాని గోముఖవ్యాఘ్రము వలె నుండి లోలోన వజ్రబాహుని యెడఁ బలుకుత్రంత్రంబన్నుచు ధ్యానించు నట్లుండి బకము మీనముల గుటుక్కున మ్రింగునట్లు దశార్ణరాజ్యము నాహుతిఁ గొన నెంచి యుండెను. హేమరథునకు మంచిరోజులు వచ్చినవి కాఁబోలును! ఒక్కయెడ మహాసేనా నికాయంబుల సమకూర్చుకొని యుద్ధసన్నాహముతో దశార్ణమును ముట్టడించె. కలిగినంతయే చాలు నని సంతసించురాజును, తృప్తి నొందని విప్రుఁడును, సిగ్గునొందెడు వేశ్యయు, సిగ్గువిడిచిన

కులాంగనయుఁ, జెడిపోవునురు. కావున రాజు లధిక సంపన్ను లైనను బరరాజ్యములను దమ శక్తిచే వశపఱుచుకొనుట వారికిఁ దగియే యుండును. అగ్నిహోత్రుఁడెన్ని యరణ్యముల దహించినను దృప్తి నొందనికరణి రాజు లెందఱి జయించి సంపదలఁ గైకొన్నను శాంతి నొందరు. అట్లు హేమరథుఁడు ముట్టడించి సేనాపతులఁ బురికొల్పవారు సేనలతో వజ్రబాహుని పురిలోఁ జొరఁబడి సువర్ణరత్నాదులు హరించిరి. ధనంబులఁ గొల్లగొనిరి. యువతులఁగుసతుల నెత్తుకొని పోయిరి. గోమహిష్యాదుల సంగ్రహించి దాస దాసీజనంబులఁ గైకొనిరి. కొంద ఱుద్యానములఁ బాడుచేసిరి. కొందఱు గృహంబుల దహించిరి. ఇట్లు పురమంతయు భగ్నము గావింపఁ దొడంగిరి. వజ్రబాహుఁ డప్పుడు పురమున లేడు. కార్యవశంబున గ్రామాంతరమున నుండెను. హేమరథుని యౌద్ధత్యమును విని పురి కరుదెంచి వజ్రబాహుఁ డప్పుడు సేనాసమేతంబుగా మాగధులం దాఁకెను. అంతఁ గ్రోధావిష్టులై యిరుదేశంగులవారును ఘోరసంగ్రామము గావింపఁదొడంగిరి.

ఢాంఢామ్మనుఫిరంగుల మ్రోఁత మిన్ను ముట్టెను. రణభేరీధ్వానములు కర్ణవిదారణము సేయఁజొచ్చెను. ఇరుపక్షములవారును బ్రయోగించెడి బాణజాలంబులు శత్రువుల కంఠనాళంబులఁ జీల్చుచున్నవి. తళతళలఁ గావించుకత్తుల దెబ్బలచే నేనుంగులు పీనుఁగు లగుచున్నవి. భగ్నంబులగు పరదంబులు కొండల ననుకరించుచున్నవి. ఆయుధంబులఁ

దెగి పడి కొనయూపిరితో నేడ్చు చున్న యోధుల హాహాకార రవంబులు రాటంబులఁ ద్రిప్పు చప్పుడులవలె మ్రోయు చున్నవి. ఘోటకంబులు పాటు తగ్గి నేలం గూలి రక్తపు టేరుల దొఱలు చున్నవి. ఒక్కయెడ రథికులు రథికులతో, నశ్వారోహకు లశ్వారోహకులతోఁ, బదాతులు బదాతులతోఁ, గ్రమయుద్ధంబుఁ గావించు చుండిరి. ఒక్కయెడ నస్త్రయుద్ధము, నొక్కచక్కి గదాయుద్ధము, నొకప్రక్క మల్ల యుద్ధము, నిట్లనేకప్రకారంబుల నలుపు చుండిరి. మహా రథికులలో నొకఁడు తనయెదుట నుండుమహావీరునిపై నాగ్నేయాస్త్ర మేయఁ బ్రతియోధుఁడు వారుణాస్త్రముచేఁ దనబాణాగ్నిని జల్లార్ప మఱలఁ దాను గినిసి వాయవ్యా స్త్రంబుచే దానిందెగటార్చును. ఒకఁడు ప్రయోగించిన పర్వ తాస్త్రమును వేరొకఁడు వజ్రాస్త్రముచే సంహరించును. ఇట్లు బహుప్రకారంబులఁ జిత్రవిచిత్రంబుగా రణము సలుపు చుండిరి. సమర రంగము రక్తప్రవాహాపూరితమై యున్నది. అందువజ్రబాహుఁడు మహాబలసంపన్నుఁ డయ్యును లోకపీ డితు లగుభార్యాపుత్రులను బుద్ధిపూర్వకముగా ఘోరా రణ్యములపాలు చేసినమహాపాతకమునఁ గాఁబోలు రణము నం దోడిపోయెను.

ఘన సుకృతమ్ము కలిగి యు
న్నను దుర్నయమున్నచోఁ దనదుకల్మిని గూ
ల్చును; జమురున్నను, దీపశిఖను
పవనము వీచి యార్పఁగాదె తలంపన్ ?

అయ్యవసరమున హేమరథుని యాజ్ఞచే యోధులు వజ్రబాహుని విరథు నొనర్చి వానిపై బడి పాశములతోఁ బంధించిరి. మఱికొందఱు వజ్రబాహునిమంత్రుల, నంతఃపురకాంతలఁ గారాగృహంబుల కీడ్చుకొని పోయిరి. మఱియు నాతని ధనకనకగజాశ్వసంపత్తి నంతయుఁ గైకొని పోయిరి. మాగధుఁ డగుహేమరథుఁడు దశార్ణదేశమును దనవశము జేసికొని నిర్భయుఁడై యేలు చుండెను.

పాపము వజ్రబాహుఁ డొనర్చినయకృత్యమునకు భార్యాపుత్రులు ప్రతిక్రియ సేయఁజాలకున్నను భగవంతుఁడే ప్రతిక్రియఁ గావించెనుగదా! వజ్రబాహుఁ డేమియుజేయ నదిలేక చెఱసాలయందుండి తనపాపమును దలపోసికొనుచు విచారమగ్నుఁడై యుండెను. వజ్రబాహునివలెనే కారాగారనిబద్ధు లగుమంత్రులును, శుద్ధాంతకాంతాజనంబులుఁ ననుభవించుకడగండ్లను వర్ణింప నలవి కాదు.

## ౨౫

అది చిత్రకార్తె యగుటంగాఁబోలు వెనుకటియుద్ధవర్షము వెలిసినవెంటనే మఱియొక యుద్ధవర్ష మారంభ మగు చున్నది. ఋషభయోగీంద్రునిపరమానుగ్రహంబుచే మహాప్రభావ సంపన్నుండును, యుద్ధవిశారదుండు, నగుభద్రాయువు

నకుఁ దండ్రిజాడయు నాతనిదురవస్థయుఁ దెలిసినది. మాగధునిపై నాగ్రహ ముదయించినది. జనకుఁడు తమ కొనర్చిన యుపకారము నతఁడు పాటింప లేదు. తండ్రికుపకారము సేయ నెంచెను. నీరు పల్లమునకే పాఱునుగాని మెరక కెక్కదుగదా! అపకార మొనర్చినవాని కుపకారముఁ జేయ నెంచినయాయుత్తమోత్తమున కెవరు సాటి వత్తురు! అట్లు చేయుట పరమధర్మంబని యతఁ డెఱుఁగును.

ఉపకారికి నుపకారము, విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము, నెప మెన్నక చేయువాఁడు నేర్పరి సుమతీ.

తనసవతితల్లులు మున్నగువారిని బద్ధులఁ జేసినవృత్తాంతమును విన్నతోడనే కోప మంకురించి నది. పెచ్చు పెరుగుచున్నది. కనులు కెంపుల ననుకరించు చున్నవి. ఆఁబోతుఱంకె వేయుచున్నది. సింహము గర్జించు చున్నది. భద్రాయు వనుమహామేఘ ముఱుము చున్నది. వాని దెబ్బ లనుపిడుగులచే మాగధులకొంపలు కూల నున్నవి. ధనుష్టంకారగర్జనములచే వారిగుండెలు వ్రక్కలుగా నున్నవి. తదీయంబగుదయామృతవర్షము వజ్రబాహు ప్రభృతులహృదయసస్యముల చీడపీడలఁ బోకార్పనున్నది. భద్రాయు విట్లు విజృంభించి మాగధులం గూల్చి తమవారలఁ గావ నెంచ నతనికి సుమిత్రుఁడును, వైశ్యపుత్రుఁడు నగుసునయుండు కుడిభుజమై సహాయుఁ డయ్యెను. ఇదియేకదా మిత్రధర్మము.

పాపము భద్రాయువునకు సేన లేదు. రథగజతురగములు లేవు. మహావీరులగు మాగధుల నెల్లజయింప నెంతసంగ్రామమునకు వలయుసాధనసామగ్రి లేకున్నను భద్రాయువున కుత్సాహము తరుగ లేదు. యోగీంద్రుడొసఁగిన శంఖఖడ్గములనే మహాసేన లనియు, మహాసాధనము లని నాతఁడెంచెను. మున్ను సోదరు లగుకుశలవు లిరువురు చేరి యజ్ఞాశ్వమునువెంటవచ్చిన శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నాదు లను, వారిమహాసేనాపరికరంబులజయించినట్లు మిత్రు లిరువురను మాగధుల గెలువనగు నని యెంచిరి. యోగీంద్రుని సత్యవచనమున నమ్మిక ముంచి శుభముహూర్తమున యుద్ధార్థమై వెడలిరి. వారికి శుభశకునములు జయమును సూచించు చున్నవి. జలపూర్ణకలశములు భుజంబున నిడుకొని ముత్తైదువ లెదురైరి. మంగళవాద్యరవములు విన వచ్చుచుండెను. వెనుకనుండి చల్లనిగాలి వీచుచుండెను. గరుడపక్షి వారికిఁ గుడినుండి యెడమభాగమున కేఁగెను. రాజలక్షణము లగుఛత్రముల ధరించినపురుషు లెదురైరి. వినయభద్రాయువులిరువురును మాగధులుప్రవేశించియున్న దశార్ణదేశమునంబ్రవేశించిరి. మాగధులచే భగ్నము కావింపఁ బడి శోభతఱిగియున్నదశార్ణమును గాంచి వగచిరి. అంత నందుఁ బ్రవేశించి యున్నమాగధుని సంబంధులఁ గొందఱి నుక్కడంచిరి. అంత హేమరథుఁడు వారలయోద్ధృత్యమునకు లెక్కసేయక పరిహసించుచుఁ గొందఱురథికుల వారిపై రణాం

బున కంపెను. భద్రాయు వావచ్చిన వారిని నిమిషమాత్రంబునం గూల్చి యారథంబునొక దానిం గైకొని తారథికుం డయ్యెను. సునయుండు సారథియయ్యెను. ఒకరథికుడై నను బోసీక యందఱిని జీల్చి చెండాడెను. హతశేషులవలన హేమరథుడు దాని విని వారు సలిపిన కార్యమును దృణప్రాయముగ నెంచి బలీయు లగు రెండు వేల సైనికులం బంచెను. మహారథుం డగు హేమరథుండు బాలురయుద్ధక్రియను బాల్యచాపలముగా నెంచుటయాశ్చర్యము కాదు. ఆసైనికుల నందఱిని గెలువ వలసినవారు వారిరువురే. అయినను భద్రాయు వొకసారి శంఖారవంబు గావింప నది ప్రళయకాలవాయు వై యందఱి నొక్కపెట్టునం గూల్చెను.

అంతి వారి పరాక్రమంబున కచ్చెరు వంది హేమరథుండు హేమరథ మధిష్ఠించి దర్పితుండై వేనవేలుగా సైన్యంబుల నమకూర్చుకొని రణరంగమున కేతెంచెను. భద్రాయువు భయమంద లేదు. ఘోరముగాం బోరు జరిగినది. మహానదీప్రవాహము కరణి తెంపు లేక రిపులు పై కరుదెంచుటం గాంచి భద్రాయువు శంఖధ్వానంబుం గావించెను. ఆయారవంబు మాగధులకు హృదయ శల్య మైనది. మహా మారియైనది. తిరుగనిప్రవాహమై వారిని ముంచివేసినది. మహాప్రళయ మై యొక్క పెట్టునం గూల్చినది. ఇట్లుండ బలదర్పితులై మఱియొకప్రక్కనుండి మాగధసేనల కారు మేఘములరీతిం గదలి వచ్చి మూగెను. భద్రాయు వది

చూచి భయమందక తా బ్రమాత్యుం డై ఖడ్గము నొఱనుండి పెఱికెను. దానిమహాప్రభలు దశలం బర్వినవి. అవి వారిని దేళ్లై కుట్టినవి, కందిరీగ లై కొఱికినవి. మండ్రగబ్బ లై యొత్తినవి, మహాసర్పము లై కఱచినవి మెరుపులై కనులు గప్పినవి. అంత భద్రాయు వాఖడ్గమును ద్రిప్పెను. అది వారి శిరంబులఁ గుమ్మరసారెంబోలెఁ ద్రిప్పెను, రోగులకు ధను ర్వాతమువలె నెగిరియెగిరి పడునట్లు చేసెను. వారలను భూమిపైఁ గాలునిలువనీకుండఁ జేసెను. హస్తంబుల వడకించెను. వింట బాణంబుల నెక్కిడి గుఱిచొఱనీకుండఁ జేసెను. మఱల భద్రాయువుఖడ్గము నధోముఖముగాఁ జేసెను. శత్రువు లెల్ల దలక్రిందై కూలిపడిరి. భద్రాయువు కరవాలంబును దాచెను. శత్రువులు ప్రాణంబులఁ దొఱంగిరి.

అడవఱకు రణంబునకు రాక నిలిచి యున్న మహాయోధు లెల్ల నహమహమికచే భద్రాయువును దార్కొనిరి. భద్రాయు వది చూచి నగియెను. శత్రువులనెల్లరగుమిగూడ నిచ్చెను. భస్మము నఱచేతిలో నుంచుకొనెను. షడక్షర మంత్రముతో నభిమంత్రించి యూఁదెను. ఆవిభూతి యందఱి పై కగఁబ్రాకెను. బంగారమునఁ బాదరసంబువోలె సర్వత్ర వ్యాపించెను. శత్రువుల మొగములు తెల్లనైనవి. కనులు కనిపింప లేదు. భద్రాయువు మఱల భస్మము నూదెను. మంత్రముచేఁ గట్టువడినభుజంగములువోలె శత్రువులు కదల లేక స్తంభీభూతులైరి. భద్రాయు వపుడు విపత్తులపై కిఁ

మునిఁగెను. నారుకొండపైఁబడ్డనీటివలె భిన్నభిన్నములైరి. సింగముపైఁ బడ్డయేళ్ళవలెఁ జెల్లాచెదరై దిక్కులం బాఱిరి కొందఱు నేలం గూలి నశించిరి. ఆ యుద్ధము చూచు దేవతలకు మహావిచిత్రము, ఆకర్ణించువారల కానందదాయకము, వర్ణించుకవుల కత్యాశ్చర్యకరమై యుండెను. భద్రాయువు శివకవచం బాచ్ఛాదించుటం గాంబోలుఁ బర బాణంబుల శాత శర విసరంబులు మేనం జొర వయ్యె. పండ్రెండువేల యేనుఁగుల బలంబు గలవానినెవ రేమి చేయఁ గలరు? యుద్ధము ముగిసినది. చూచితిరా మహాప్రభావ సంపన్నుఁ డగు ఋషభయోగీంద్రుఁ డెంతపనిఁ జేసెనో.

వదలింప నుఱుకసింగపుఁ
గొదమయును మదమలినగండకుంజరములపై
నిది బలశాలికి సహజము,
కద తేజోనిధికి వయసు కారణ మగునే!

ఇట్లు భద్రాయువు పగఱ నుఱుమాడి యంత హేమరథుని జంపక పాశబద్ధునిగా నొనర్చి మంత్రులు మున్నగు వారిం గూడఁ ద్రాళ్ళచే బంధించి మున్ను తన వారలకుఁ జేసినటులఁ బ్రతిక్రియ గావించి ఋణంబుఁ దీర్చికొనియెను. మిగిలినవారిని విడిచివుచ్చఁ బ్రాణంబులు నిలిచెఁగదా యని సంతసించి లోలోన భద్రాయువునకు మ్రొక్కుచు వారు యథాయథంబుగఁ బలాయితులైరి. భద్రాయువంత నిలాపతి వజ్రబాహుని కట్లు వదలించి తన సాపత్న్యమాతల

నమాత్యులను పాశవిముక్తులం జేసి కాపాడెను. అంత వా రందఱును మనోవ్యధలు విడిచి పునర్జన్మ మెత్తితి మని సంత సించిరి.

౨౬

రాహువుచే విడువఁబడిన శశాంకునివగిది భద్రాయువు మూలమున ప్రజబాహుఁడు కారాగార విముక్తుండై మనోవ్యధను వీడి హర్షించుచు నతఁడు తన పుత్రుం డని యెఱుఁగడు గాన మమ్ములం గాచిన యీ మహాత్ముఁ డెవ్వఁడై యుండ నోపు. ఈవీరపురుషుఁడు నాకు సంబంధించినవాఁ డనుటకు నే నెఱుంగనియిట్టిశూరుఁడు నావారిలోఁ గలఁడే? మా గధునిశాత్రవుఁడయ్యేనేని హేమరధుని జయించును గాని మమ్ముల గాపాడును? ఈపుణ్యాత్ముఁ డెవని సంబంధుఁడో తెలియరాకున్నది. అడిగి చూచెదఁగాక అని వితర్కించి "మహానుభావా! నీవెవరివాఁడవు? నిన్నుఁ జూడ దేవగంధర్వ యక్షాదులలో నొక్కరుండవని తోఁచుచున్నది. అకాలమేఘు మెండిపోయిన చెరువునం దమృతవర్షము నింపి మృతప్రాయము లగు జలచరంబులకుఁ బ్రాణముల నొసఁగిన చందంబున మమ్మెల్లరఁ గాపాడితివి. నీవు చేసిన యీ మహోపకారము నెన్నటికి మఱువఁ జాలము. అనుగ్రహించి

నీదివ్యనామధేయనివాసాదులం దెల్పి మాకుఁ గర్ణపర్వంబు చేయుము. నీజననస్థితి నెఱుఁగ వేడుకపడు చున్నవారము. అని యడుగ సవినయంబుగా నతఁ డిట్లనెను:—

"అయ్యా ! నన్ను భద్రాయు వందురు. నాజన్మచరిత్రంబును, జననీజనకులనామధేయములను, దెలుపుట కిది సమయము కాదు. మఱియొకతఱి నెఱిఁగించెదను. నీ విఁక శత్రుభయమ్మును విడిచి నీ వారితోడ నిశ్చింతముగా నుండి సుఖంబుగా రాజ్యముఁ జేసికొనుము. ఇపుడు మగధ దేశము కూడ నీకు వశ మైయున్నది. నీ పత్నీసచివులతోఁ గూడ నానంద మొందుము. నీకిఁక నెట్టి భయంబును గలుగఁ బోదు. నేను వెడలి వచ్చెదను. ఇదె నమస్కరించు చున్నాఁడ" నని సెలవు గైకొని సునయునితోఁ గూడ దల్లి యొద్ద కరుదెంచెను.

అక్కడ కోమటిపల్లెయందు సుమతి యిన్ని దినములు కొమరుఁడు తన నెడఁబాసిపోయి రాకుండుటంజేసి నయన విహీనకరణిఁ బుత్రునిస్థితి యేమయ్యెనో యని కుందుచుండ నింతలో భద్రాయుసునయు లేతెంచిరి. వెంటనే భద్రాయువు తల్లిపాదములకు నమస్కరించి తాము మాగధులను జయించుటాదిగా జనకాదుల బంధవిముక్తులఁ జేసివచ్చిన వృత్తాంతమునంతయు సవిస్తరముగా వినిపింప సుమతి పరమానందభరిత యై నందను గౌఁగిలించి శిరంబు మూర్కొనియెను. అంత భక్తితోఁ దనకు మ్రొక్కునయానునయుని

బుత్రప్రేమచే గాఢాలింగన మొనర్చి గౌరవించెను. అక్కడి నుండి కుమారులిరువురు పద్మాకరునిసన్నిధి కేఁగికృత నమస్కారు లై తమరు సలిపినకార్యము నివేదింప నతఁ డుప్పొంగి వారి నాలింగన మొనర్చి సముచితాలాపంబుల గారవించుచు నానందపరవశుఁ డయ్యెను.

అంతనుండియు సునయభద్రాయువులిరువురును ప్రియా లాపములచేఁ బౌరులకానందము గొలుపుచు హెచ్చుచెలిమితో నచ్చటనే సుఖముగా నుండిరి. ఉత్తములస్నేహ మిట్లే యుండునుగదా!

మొదలఁ జూచినఁ గడుఁగొప్ప పిదపఁగుఱుచ
యాదిఁ గొంచెము తర్వాత నధిక మగుచుఁ
దనరు దినపూర్వపరభాగజనిత మైన
చాయపోలికఁ గుజనసజ్జనుల మైత్రి .

అక్కడ వజ్రబాహుఁడును రాజ్యసుఖ మనుభవించుచుఁ దనను గాపాడినబాలుని మఱల నెన్నఁడు చూతునో యనుచు, నీశ్వరుఁడే యారూపమున వచ్చెనా యని వితర్కిం చుచు, నాతని నెల్లవేళల మఱవక తనహృదయమునఁ దలఁచు చునుచు నుండెను.

ఇఁక నిషధదేశవిషయ మాలోచింపవలసి యున్నది. పింగళ యనువేశ్య శివయోగిని బూజించినపుణ్యావిశేషముచే సీమంతినీ చంద్రాంగదులకుఁ గీర్తిమాలిని యనుపుత్రికగా నుద యించె నని వింటిరిగదా! ఆబాలిక క్రమంబుగా నభివృద్ధి నొంది ముద్దులు మూటగట్టు చక్కదనంబుతోఁ జూచువారల కానందము గలిగించుచు విద్యాబుద్ధులచే వన్నె కెక్కి వివాహ వయస్కయై యుండెను.

ఒకనాడు చంద్రాంగదునింటికి ఋషభయోగీంద్రుఁ డరుదెంచెను. సీమంతినీచంద్రాంగదులు యోగీంద్రు నర్ఘ్య పాద్యాదులచే నతిభక్తితోఁ బూజించిరి. సర్వోపహారదయము లతో వినమ్రులై సేవించిరి. ఉత్తములగు సంపన్నుల లక్షణ మిదియేకదా!

తరువు లతిరసఫలభారగురుతఁ గాంచు
నింగి వ్రేలుచు నమృతమొసంగు మేఘుఁ
డుదతులు గారు బుధులు సమృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిది సహజగుణము.

ఋషభుఁడును వార లొనర్చుసపర్యల నంది శ్రవణమాత్ర పరిహృతాఖిలదోషములగు పరమేశ్వర కథావిశేషములచే గాలముఁ గడపుచుఁ జంద్రాంగదునిభక్తిని, సీమంతినిమహి మమునకు నానందించుచు నింతలో మధ్యాహ్న మగుడు

వారిచేఁ బ్రార్థింపఁబడి తాత్కాలికకృత్యంబులం దీర్చి షడ్రసోపేతము లగువిందు లారగించి యనంతరమునఁ దాంబూల చర్వణంబుఁ గావించి మృదుస్పర్శం బగుమణిపీఠంబు నధిష్ఠించెను.

అపుడు సీమంతినీచంద్రాంగదులు పాదసేవనము సలుపుచుండ ఋషభుఁడు వారలతో ధర్మాలాపములఁ బ్రసంగించుచుఁ బ్రస్తావనావశంబున భద్రాయుశ్చరితంబు సఖిలంబు నెఱింగించి యయ్యెడఁ దనను సేవింప వచ్చినకీర్తిమాలినిం గాంచి యీమీపుత్రికారత్నమునకు భద్రాయువనుకూల వరుఁడు కానోపు నని వాక్రుచ్చెను. మునిపలుకుల కాదంపతు లిరువురును సంతసించి "మహాత్మా! మీవచనం బమోఘము, తమకెప్పుడును భక్తులకు క్షేమముఁ గూర్చుటయందే సంకల్పము. తమరింతకుమున్ను సెలవిచ్చుటచే భద్రాయువున కీకన్నియ నొసఁగుటయందే మాకుకూడ సంతోషము వొడముచున్నది. కావున మాకాచిరంజీవి యల్లుడగునట్లు వరమనుగ్రహింపు:" డని నమస్కరింప మనో వాంఛాఫలసిద్ధిరస్తు, అని దీవించి ఋషభుఁడు మఱియును, "అమ్మా! సీమంతినీ! మీయోగ్యతను నే నెఱుఁగుదును. మీకన్యయు మిమ్ముఁ బోలినగుణవతియే. సంపద, వంశము, సౌందర్యము, వయస్సు, విద్య, శుభలక్షణములు, బాంధవ్యము, కలవానికి బాలిక నీయఁ దగును. కావున నివి యెల్లనాకుమారునియందుఁగలవు. మీకతఁడల్లు డగుటలక్ష్మి

నారాయణులకుఁ గుమారస్వామి యట్లుఁ దైనట్లు తగి యుండును. కీర్తిమాలినీభద్రాయువులు దంపతు లగుదురేని యమృతవల్లీసుబ్రహ్మణ్యేశ్వరులవలెఁ దేజరిల్లుచు దీర్ఘాయుష్మంతు లగుదురు. మీ ప్రయత్నము సఫలము కాఁగల"దని వక్కాణించి యథేచ్ఛం జనియెను.

అంతఁ జంద్రాంగదుఁడు ఋషభునివచనమును బరమానుగ్రహముగా శిరసావహించి పుత్రి కావరణ మొంబునఁ గృతనిశ్చయుండై భద్రాయువును దనయొద్దకు రావించి గౌరవించి ప్రస్తావనావశమునఁ దనయభిప్రాయంబుఁ దెలుప నుచితజ్ఞుఁడు కావునఁ దన కాసంబంధమును బరమేశ్వరుఁడను గ్రహించినట్లుపొంగి యాతఁడుసమ్మతించెను.

అంత శుభముహూర్తంబునఁ జంద్రాంగదుఁడు పద్మాకరుఁడు మున్నగువారిని, వజ్రబాహుప్రభృతులగు దశార్ణవాసుల నార్యావర్తవాసుల నందఱిని రావించి మహేంద్రవిభవముతోఁ గీర్తిమాలినీభద్రాయువుల కుద్వాహమహోత్సవం బొనర్చెను. ఆనవీనదంపతులు రోహిణీచంద్రుల మాడ్కిఁ దేజరిల్లు చుండిరి. సుమతికోర్కె సఫలమైనది. పిమ్మటఁ జంద్రాంగదుడు సుమతిని, వజ్రబాహుని, విశేషముగా సత్కరించి పద్మాకరాదులను, సుమతిసేవకులను గూడ సమ్మానించెను. అంత భద్రాయువు కీర్తిమాలినీ సహితుఁడై తల్లి కభివాదనంబుఁ గావించి వజ్రబాహుని చరణారవిందములకు నమస్కరించెను. అపుడు వజ్రబాహుఁ

ఞా నూతనదంపతుల దీవించి నయనారవిందముల నానంద జల బిందువులు తులకింపఁ జంద్రాంగదునితో నిట్లనెను.

“మిత్రమా! చంద్రాంగదా! యీనీయల్లుఁడు నాకొనర్చిన మహోపకారము నింతింత యని నుడువఁ జాల. ఈ చిరంజీవిసహాయముననే మేమందఱమును బ్రదికి మఱల మీఁబోటిపరమమిత్రులను దర్శింపఁ గలిగితిమి. ఈపరమానంద రాకాసుఁ డెవనిపుత్త్రుఁడో యిప్పటికిని తెలియఁజాలక నెప్పుడును వీనిచే తలంచుచును వీని వృత్తాంతమును వినఁగోరి యున్నవాఁడ. ఇట్టిమహాశూరశిఖామణిని, మహాధర్మాత్ముని, దయాసముద్రుని, జగజ్జేగీయమాన యశోవిశాలుని, నల్లునిగాఁ జేసికొనఁ గలిగితివి. ఏమినీభాగ్యము! నీపుత్త్రిక యదృష్టమెంతని చెప్ప వచ్చును!”

ఇట్లు కొనియాడుచుండ, భద్రాయువు సనుమతిచేఁ జంద్రాంగదుఁ డిట్లనెను. “మిత్రమా! వజ్రబాహుమహారాజా! తమరు మాకిపుడు వియ్యంకులైతిరి. ఈచిరంజీవి నీకుమారుఁడు. ఈమె నీభార్య యగుసుమతి. వీరిరువురును రోగపీడితులై యుండ నీ వపుడు వీరిని వనంబున కనిచితివి. వీరెట్లో కోమటిపల్లియందుఁ జేరిరి. అందు వైశ్యశిఖామణి యగు నీపద్మాకరుఁడు వీరిని తండ్రివలెఁ గాపాడుచుండ నీసుతుఁడు మృతుండు గాఁగ మహాత్ముఁ డగు ఋషభయోగీంద్రుఁడు వీనిఁ బునర్జీవితుంజేసి సకాలంబున మఱల నేతెంచి ధర్మవిద్యోపదేశం బొనర్చి శత్రుక్షయకరంబు లగుశంఖఖడ్గముల

నొసంగి శివపంచాక్షరీ శివకవచ మహామంత్రముల నుపదే
శించి ద్వాదశసహస్ర గజబలంబు ననుగ్రహించెను. అంత నీ
పుత్రుఁడు హేమరథబద్ధుఁడ వగునిన్నుఁ గావాశీ రాజ్యం
బొసంగె. ఆపరమయోగీంద్రునుపదేశంబుచే నాయీపుత్రికను
నీకుమారునకుఁ బరిణయంబు చేసి యేను ధన్యుండ
నైతిని. యోగీంద్రుని ప్రభావముచే నీయీభార్యాపుత్రులు
దివ్యదేహులైరి. ఇంక నీవు వీరలతో నీపురంబుఁ జేరి సుఖం
బుండుము"

వజ్రబాహుండా చంద్రాంగదునిమాటల కుప్పొంగి
నిరంతర నిష్యందదానందజలబిందు సందోహపరికలిత నయనార
విందుండై నెమ్మేనఁ బులకలు వొడమఁ గుమారునిం బోలు
కుమారుని బాఁగుఁ బునరాలింగనముఁ జేసికొనుచు, మున్ను
తా నొనర్చిన ఘోరకృత్యంబునకుఁ బశ్చాత్తాప మొంది
తన్నుఁ దా నిందించుకొనుచు, సుమతిం జూడ లజ్జించుచుండెను.
అపుడు సుమతి పరమసద్గుణసమేత కావున భర్త చేసిన
యవమానము నెంచక వచ్చి నమస్కరింప వజ్రబాహుఁ
డనునయోక్తుల నూరడించుచు నామెను గౌరవించెను. అంతఁ
జంద్రాంగదుఁ డల్లునకు గోసువర్ణదివ్యాంబరాభరణంబు లిడి
కూఁతున కసూనముగా నరణంబొసఁగెను. సీమంతిని కీర్తి
మాలినికిఁ దగుబుద్ధులం గరపి యల్లునితోఁ గూడఁ బ్రయా
ణంబు నడపెను. పిమ్మట వజ్రబాహుఁడు సుమతిని, కొడు
కును, కోడలిని, ముందిడుకొని రథారూఢుఁడై సపరివారం

బుగా దక్షిణార్ణవమున కేతెంచి గృహప్రవేశ మహోత్సవముఁ గావించి యనంతరమున భద్రాయువును రాజ్యాభిషిక్తుని జేసెను. భద్రాత్ముం డగుభద్రాయువు కీర్తిమాలినితోఁగూడ మహోన్నతంబుగా రాజ్యసుఖంబు లనుభవించుచు హేమరథుని బంధవిముక్తుని జేసి పంచి ప్రజానురంజకముగా రాజ్యము సేయుచు దేవబ్రాహ్మణప్రసాదముచే వర్ధిల్లు చుండెను. యోగీంద్రమునిపూజ యెంతమహాన్న త్యమును ఘటిం చెనో చూచితిరా ! అదియెల్లశుభంబులకును మూలకారణము.

౨౮

ఒక్క వసంతసమయమున భద్రాయువు కీర్తిమాలినీసహితుఁ డై విహారార్థముగా వనమున కేఁగెను. అందుఁ జంపకాశోక పున్నాగాది వృక్షముల నవకిసలయములు రాజ దంపతుల నింకు వేంచేయుఁ డని పిలుచు చున్నవో యనునట్లు మంద మారుతముచేఁ జలించుచుండెను. సుకుమారరసాల తరువు లాధరామహేంద్రులకై వహించి కానుకలఁ దెచ్చు చుండెనో యన వాతధూతంబులై ఫల భారములచే నుబ్బూఁత లూఁగు చుండెను. విశాలచ్ఛాయలు గలమహీరు హంబు లాజాయాపతులకు ఛత్రంబు పట్టు చున్నవో యను నట్లు విస్తీర్ణంబులై యులరారు చుండెను. భూకాంత తన

కాంతునకుఁ బచ్చలు చెక్కినపీఠము నర్పించెనో యనఁ గో మలబాలతృణాన్విత మై విలసిల్లు చుండెను. లతావితానము లావట్టభద్రునకు మంగళార్థంబుగా లాజలు చల్లుచున్నవో యనఁ గుసుమ విసరంబు లావంపతులపైఁ గుమ్మరించు చుండెను. గంధవహుఁ డనుమిత్రుఁ డావిలాసవంతుల పై గందవడి చల్లుచుండెనో యనఁ బుష్పపరాగంబుల వెద జల్లు చుండెను. ఇట్లు పరమసుఖావాసం బగు వనమున భద్రా యువు సపత్నీకముగా విహారము సేయు చుండెను.

అప్పురోభాగమున భార్యాభర్తలు చను చుండిరి. వారు బ్రాహ్మణులు. వారిలోఁ గొంచెము ముందరుగుచున్న యా విప్రపత్ని నొకమహావ్యాఘ్రము తఱుముకొని వెంట నంటి రాగ నామె "హా! చచ్చితిని. చచ్చితిని. పెద్దపులి పైబడి మ్రింగవచ్చు చున్నది. రాజేంద్రా! రక్షింపుము రక్షింపు"మని పెద్దపెట్టున నేడ్వఁ దొడఁగెను. ఆ యార్తనాదమును విని భద్రాయువు తత్క్షణంబ వి ల్లెక్కువెట్టి శరంబుల నాశార్దూ లంబుపైఁ బరపె. తీవ్రంబు లగుబాణంబులు గ్రుచ్చు కొన్నను బెదరక పులి యాచెలువను వదలక నోటఁ గఱచు కొని పరుగిడు చుండెను. రాకొమరుఁడును వెంటఁ బాయక వెంటనంటి క్రూరనారాచపరంపరలు వర్షప్రాయముగాఁ గురి పించు చున్నను లక్ష్యము సేయక యది దూరఁ మేగి మాయ మయ్యెను. అపుడు భద్రాయువుతాఁ జేయునది యేమియు లేక నిర్వ్యారపడి నిలిచి యుండెను. ఇంతలో, "ఓప్రియ

రాలా! నీవు పతివ్రతవు. నాకుఁ బ్రాణంబులకంటెఁ బ్రియు రాఁవు. నన్నొంటిరిగా నిందు విడిచి నీవుమాత్రము లోకాంతరమున కరిగెదవే! ఇది నీకు ధర్మమా! నిన్ను విడిచి నే నిం కెట్లు బ్రతుకువాఁడ" నని యామె భర్త హాహా కారంబు సేయుచుఁ బరుగుపరుగున నరుగుచు దారిలో భద్రా యువును జూచి "రాజేంద్రా! నాభార్యను బులి యెత్తికొని పోవుచుండ నీ విచ్చటనుండి చూచుచునే యుంటివిగదా! నీ దివ్యాస్త్రంబులేమాయె? నీపంద్రెండువేల యేనుఁగులబలం బేమాయె? నీ కిట్టిశంఖఖడ్గంబు లున్నఁ బ్రయోజన మేమి? నీమంత్రవిద్యామహిమ యెందుఁ గలసె? బలవంతుఁ డని పేరుగొన్న నీ వొక్కపులిం జంపి పతివ్రతను గాపాడఁజాల వైతివి. ఇంక నీబలం బేల? నీక్షత్రధర్మ మేల! ఇట్టినీవు ప్రభువ వైన బ్రయోజనం బేమి! ఆర్తులను, శరణాగతులను, దరిద్రులను, బతివ్రతలను, గాపాడఁజాలనిచో భూపాలురు విషముం దినినవైనను, నిప్పులం బడినవైనను, జచ్చుట మేలు!"

ఇట్లు దూషింప భద్రాయువు లజ్జించి "అక్కటా! దైవ విపర్యయంబుననే నాపౌరుషము భగ్నమైనది. నాకీర్తి నేల గలిసినది. నా కులోచితధర్మము పాడైనది. ఛీ, యింక నా బ్రతు కేల? ఎందుఁ జొత్తును? ఏమిచేయుదును? అనుకొన్నఁ బ్రయోజన మేమి?" అని యిట్లు పరితపించుచుఁ గొంతవడికి మనంబు వదిలపఱచుకొని "కానిమ్ము. పతివ్రత యగుభార్యను గోల్పోయిన యీ బ్రాహ్మణోత్తమునకు నాప్రాణంబుల

నర్పించినైనను శోకముఁ బోనడంచెద" నని యతని నమీపించి పాదంబుల కెరగి "భూసురోత్తమా! దయనేయుము. విలపింపకుము. ఇమ్ము తప్పివచ్చినపు డెవ రేమి చేయఁగలరు? ఏను నీభార్యను గాపాడఁజాలక పాపాత్ముఁడ నైతిని. నాపరాక్రమము భగ్న మైనది. ఏమి చేయుదును? ఈనా రాజ్యమును, ధనకనకాదులను, నాప్రాణమును సర్వంబును గూడ నీయధీనముఁ జేసెద. శాంతింపుఁడు. విలపించినఁ బ్రయోజన మేమి?" అన, బ్రాహ్మణుఁడు "రాజా! వినుము. గ్రుడ్డివాని కద్ద మేల? బిచ్చగాని కిల్లేల? మూఁగవానికిఁ బుస్తక మేల? భార్య లేనివానికి ధన మేల? నీవు నీకుఁ గల సర్వంబును నా కిచ్చెద నంటివి. అసత్య మాడుట మహా దోష మని యెఱుఁగుదువుగదా! ఈనీపెద్దభార్యపై నాకుఁ గోర్కె యున్నది. ఈ మెను నా కర్పింపుము. సంతసించెద." నని పలికెను.

భద్రాయువు: "అయ్యా! ద్విజోత్తమా! తమరు నాభార్యను గోరుట ధర్మమగునే? గురువు లిట్లుపదేశింతురే? పరులభార్యలం గోరువారికి స్వర్గప్రాప్తి లే దనియుఁ, గీర్తి నశించు ననియు శాస్త్రములు నుడువుచున్నవి. మఱియు లోకమున నెట్టిదాత లైనను ధనకనకవస్త్రవాహనాదుల నొసంగిరి గాని తమభార్యల నొసంగిరే! ఎట్టిమహాపాపము లొనర్చినను బ్రాయశ్చిత్తము కలదు గాని పరదారలం

గనయువారల కదిలే దంద్రుు. కావున నిది యనుచితము గదా!"

బ్రాహ్మ: "ఓయీ! యెట్టిపాపముల్నైనను నేను తపశ్శక్తివలనఁ బోఁగొట్టుకొన నేర్తును. పరస్త్రీగమన దోషమునడంచుట నాకెంతలోనిది. కావున నీభార్యనునా కొసంగుము. ఈకుంటివేని నీవు భయార్తుల రక్షింపకుండుట వలనఁ గలిగెడి మహానరకంబునఁ గూలెదవు."

భద్రాయు వా విప్రునిమాటలకు భయమంది "ఆర్తులఁ గావకుండుటయే మహాపాప మగును గాని భార్య నొసఁగుట యంతపాపము కా నేరదు. కావున నాధర్మపత్ని నీవిప్రున కొసంగి యార్తరక్షణము సేయనిపాపమును దొలఁగించుకొని యెద. భార్య నితరున కొసఁగినపాపము వాయుటకు నిప్పాలం గూలెద. ఇందుచేఁ బాపక్షయంబును, జగత్ప్రసిద్ధంబగు యశంబును గలుగఁ గలగు." అని నిశ్చయించియచ్చటనే వహ్నిం బ్రజ్వలింపఁ జేసి యాభూదేవునకుఁ దనభార్యను జల ధారాపూర్వకంబుగా దాన మొసంగి యంతట స్నాతుఁడై పరిశుద్ధుండై దేవతలకు సమస్కరించి యగ్ని దేవునకు ముమ్మాఱు ప్రదక్షిణనమస్కారములు గావించి నిశ్చల చిత్తంబునఁ బరమేశ్వరుని ధ్యానించి యగ్నిహోత్రంబునం బడఁబోవుచుండ నప్పుడాకీర్తిమాలినీభద్రాయువుయెదుట భద్రమూర్తి యగుపరమేశ్వరుడు సాక్షాత్కరించె.

గౌరీయుక్తుం డగునప్పరమేశ్వరుడు త్రినేత్రయుతుఁడై,

భుజంబులఁ బన్నగోత్తరీయంబు చెలువొందఁ, శిరంబున బాలచంద్రునిఁ గరంబునఁ బినాకం బను చాపంబును దాల్చి, నిర్మల స్ఫటికమును బోలిన మేనితో, బచ్చని జడలయందు గంగా తరంగములు దులకింప, సర్పహారంబు లురంబున వ్రేల, త్రిశూలడమరు కుఠారాదిదివ్యాయుధంబులఁ గైకొని, వెండి కొండం బోలిన వృషభేంద్రముపై నధివసించి, దయారసంబును జిలుకు నైదు మోములతో భద్రాయువు కనులయెదుటఁ గన్పట్టెను. అపుడు దివినుండి పుష్పవర్షములు గురిసె. దేవ దుందుభులు మొరసె. అప్సరలాడిరి. గంధర్వులు పాడిరి. సనకసనందనాదిబ్రహ్మర్షులు, నారదాది దేవర్షులు, నింద్రాది దిగ్పాలురు, బ్రహ్మాదులు, నమ్మహాదేవుని చుట్టును జేరి మహా భక్తియుక్తులై జయజయధ్వనులచేఁ గీర్తించుచుండిరి.

అప్పుడు మహాపుణ్య పరిపాకలభ్యంబగు నా దేవదేవదివ్య దర్శనంబుచే భద్రాయువు పొంగితన్మయుండై, కనుల నానందజలబిందువు లొలుక, గాత్రంబున రోమాంచములు పులకింప, భక్తి పారవశ్యంబున వినమ్రుండై నిటలతటంబున నంజలి ఘటించి యిట్లు ప్రస్తుతింపఁ దొడఁగెను.

శ్రీమన్మహాదేవ, దేవాదిదేవా, కృపాపూర్ణభావా, సురక్షాస్వభావా, మహోన్నత్ప్రభావా, యనిర్వాచ్యమహా నీప్రభావంబుచే సత్యసంకల్పలీలావిశేషంబునన్ సర్వలోకంబులన్ సర్వభూతంబులన్ సర్వమున్ భోగ్యభోగస్వరూపంబుగా సృష్టి గావించి యందంతటన్ నిండి నీ వెందునుం

భోక్తవై కర్తవై భర్తవై హర్తవై సాక్షివై యుండు
నీసత్యరూపంబు నెన్నంగ లేక యజ్ఞులౌ కొంద ఱీశుండు లేడంచు
వాదింతు రీభూమియున్ వార్ధియున్ తార లాకాశ
భూతంబు లిట్లుండగా వీనికిం గారణం బెద్దియే యుండనోగాదె
యాకారణం బీవె యం చెన్నఁగా రాదె నీ వెల్లరూపంబులం
దాల్చి సద్భక్తు లేరూపుతో నిన్ను సేవింతురో వారి
కారూపమును జూపుచున్ వారి కోర్కెల్ కడుం గూర్చుచుం
జేర్చుచున్ పాపముల్ వాపుచున్ ధన్యులం జేయుచున్ వారి
కానంద మోక్షంబులన్ నీవకా గూర్తు వోలోకనాథా!
నినుం గొల్వకున్నట్టి సంసార బద్ధాత్ములౌ వారి కెంతేని
యుగ్ర నీవు గనప్పట్ట వాపత్సమూహంబులం బాప వెల్లప్పు
డున్ మోహవారాశిలో ముంచుచున్ కష్టముల్ గూర్తు
వోయయ్య నిన్ యోగివర్యుల్ సదా నిర్మల స్వాంతమం
దుంచి ధ్యానించి సేవించి పూజించి యంతర్ముఖత్వంబునన్
గొల్తురే నట్లు నిన్ గొల్వగా లేనిపాపుండ విజ్ఞానహీనుండ
సత్కర్మధర్మంబు లెంతేనియుం జేయఁగా లేనిదుష్టుండఁ
గష్టుండ నేనెన్ని యో దోషముల్ సల్పితిన్ వాని నీయాత్మలో
నెన్న కే సేయునావందనం బొందుమం గొంచునన్ పుత్రుగా
నెంచి నాతప్పు మన్నించి నాకుయ్యి వాలించి నాబాగు
యోచించి నాకోర్కెలం దీర్చి నన్నుం గటాక్షించి నీవానిగా
నెంచి నీచెంతకుం జేర్పుమా జ్ఞానముం గూర్పుమా విద్య
లన్ నేర్పుమా కోర్కెలం దార్పుమా యిష్టసంసిద్ధి చేకూ

ర్నమా నన్ను రక్షింపుమా కారణాకార లోకప్రజాధార సౌభాగ్యమందార యోసద్గుణాధార యోమృత్యు సంహార యోమంత్రసారా, నమస్తే నమస్తే నమః

౨౯

ఇట్లు భద్రాయువు వినుతింపఁ బార్వతీ పరమేశ్వరులును సంతుష్టులైరి. అంతఁ బరమేశ్వరుఁడు "వత్సా! సంతోషము సంతోషము! నీభక్తికిని, నీవు సలిపినపుణ్యాస్తవంబునకు బ్రసన్నుఁడ నైతి. నీ వెప్పుడు ననన్యభక్తితో నన్ను సేవించుచుండుము. నేను నీచిత్తశుద్ధిని బరీక్షించుటకై యాబ్రాహ్మణ రూపంబున వచ్చితిని. ఆ వ్యాఘ్రము నామాయాస్వరూపంబు. ఆ బ్రాహ్మణకాంత యీపార్వతీదేవియే. నామాయ పులియై బ్రాహ్మణపత్నిం బట్టుకొని నీ బాణఘాతములకు నోర్వక నిన్న లక్ష్యముచేసి యదృశ్యమైనది. బ్రాహ్మణ రూపుఁడ నగు నేను నీసాహసమును బరీక్షించుటకై నీభార్యను గోరితిని. సంశయింపక నీవు భార్యాదానముఁ జేయుట కిచ్చ మెచ్చితిని. నీభక్తికి మాత్రమేగాక యీ కీర్తిమాలినీ భక్తివిశ్వాసములకు, నీమె పాతివ్రత్యమునకుఁ గూడ సంతసించితిని. ప్రసన్నుఁడనైతి. వరము గోరుము"

అని సెలఁ వొసఁగ భద్రాయువు చేతులు జోడించి "దేవా! ఆనందమయుఁడ వగు నీ విట్లు దివ్యరూపమునఁ బరమానుగ్రహముచే సాక్షాత్కరింపఁ దుచ్ఛంబు లగు నైహిక సుఖలాభంబులఁ గోరనేర. ఏనును, గీర్తిమాలినియు, నాతలిదండ్రులును, బద్మాకరుఁడును, సీతని యనుంగుపుత్రుఁ డగు సునయుఁడును, సర్వదా నీపార్శ్వంబున నిలిచి సేవించునట్లు వరం బనుగ్రహింప వేడెద" నని కోరెను. అంతటఁ గీర్తిమాలినియు బహుప్రకారంబులఁ బ్రస్తుతింప ననుగ్రహించి "బిడ్డా! నీవును వరంబుఁ గోరుకొను" మన "మహాప్రభూ! నాతలిదండ్రు లగు సీమంతినీ చంద్రాంగదులును దేవర వారి సన్నిధానమున నుండి సేవించునట్లు వరము దయసేయుఁ" డని ప్రార్థించెను. పరమేశ్వరుఁడు వారి విన్నపము లాలించి వారి పవిత్రహృదయములకుఁ బ్రీతుఁడై మీవరంబులు కోరినట్లొసఁగితి నని సెల వొసఁగి యంతర్హితుఁ డయ్యెను.

అంతఁ బరమానందముతోఁ గీర్తిమాలినీ భద్రాయువులు పురంబుఁ జేరి తమవారి నందఱిని రప్పించి యాపరమేశ్వరానుగ్రహవృత్తాంతముఁ దెలుప వా రందఱును బరమానందాంబునిధి నోలలాడిరి. భద్రాయువు పదివేలయేండ్లు మహాసుఖముతో రాజ్యమేలి నిత్యమును బరమేశ్వరు నారాధించుచుఁ దదనంతరము పరమేశ్వరుసాలోక్యమోక్షము నొందెను. ముందుఁదెలుపఁబడిన సీమంతినీ ప్రభృతులునుబహుకాలము భూలోకసుఖంబుల ననుభవించుచుఁ బరమేశ్వరభక్తిపరి

పూర్ణులై యుండి జన్మాంతమునఁ బరమేశ్వరు దివ్యసమ్ముఖంబున దివ్యరూపములతో నానంద పరిపూర్ణులై యుండిరి.

పరమపవిత్ర మగు నీచరిత్రమును జదివినను, విన్నను, వ్రాసినను, సర్వాభీష్టముల నొంది పరమేశ్వరానుగ్రహ పాత్రు లయ్యెదరు. అని శ్రీ సూతుఁడు శౌనకాది మహామునులకుం దెలిపెను.

శ్రీపార్వతీ పరమేశ్వరార్పణమస్తు!

సమాప్తము.